శ్రీమతే రామానుజాయ నమః
శ్రీమద్వరవరమునయే నమః



# సాంప్రదాయిక వ్యాస మాలిక – 7



తిరునారాయణ పెరుమాళ్, మేల్కోట



'పండితరత్న' డా॥ ఉ.వే. శ్రీమాన్ ఈయుణ్ణి అళ్గ శింగరాచార్యులు

సమర్పణ: వంగల వేంకట కేశవ అయ్యంగారు

# విషయ సూచిక

# మనలను రక్షించే కేశవాదిద్వాదశ నామాలు

భగవంతుని సహస్రనామ స్తోత్రం వేయి నామాలను కలిగినది. దానిని పారాయణ చేయడానికి కొంత సమయం పడుతుంది. ఆ మాత్రం అంతసేపు అనుసంధానం చేసే శక్తి, సమయం కూడా శక్తి లేనివారికోసం అష్టోత్తర శతనామ స్తోత్రాలు ఉన్నవి. ఆలయాలలో, గృహాలలో సామాన్యంగా అర్చన చేసేటప్పుడు ఈ స్తోత్రాలే ఉపయోగింపబడుతున్నవి. వీనిని చెప్పుకోవడానికి ఒక పది నిమిషాలు పట్టవచ్చు. అయితే, ఇంతకంటే కూడా సులభంగా, తక్కువ సమయంలో భగవన్నామాలను అనుసంధానం చేయడం కోసం ఉన్నవే, భగవంతుని కేశవాది ద్వాదశనామాలు.

కేశవ, నారాయణ, మాధవ, గోవింద, విష్ణు, మధుసూదన, త్రివిక్రమ, వామన, శ్రీధర, హృషీకేశ, పద్మనాభ, దామోదర అనే నామాలే ఈ 12 నామాలు. ఈ 12 నామాలు పలుచోట్ల ఉపయోగపడుతున్నాయి ఉత్తరభరతంలో అయితే, ఈ 12 నామాలే సంవత్సరంలోని 12 నామాలకు పేర్లుగా వ్యవహరింపబడుతున్నాయి. ఈ క్రమంలో మార్గశిర మాసమే కేశవ నామంతో వ్యవహరింపబడే మొదటి మాసం. ఈ మాసం నుండి ఆరంభించి క్రమంగా 12 నెలలు 12 నామాలతో నిర్దేశింపబడుతున్నాయి. చివరి మాసం అయిన కార్తీక మాసం దామోదర మాసమని పిలువబడుతున్నది.

మన గృహాలలో భగవదారాధన చేసేటప్పుడు మంత్రపుష్ప సమయంలో ఈ పన్నెండు నామాలతో ఆరంభించి అర్చన చేయడం, చివరిలో కూడా ఈ 12 నామాలను చెప్పడం సంప్రదాయంగా వస్తున్నది. భగవదాలయాలలో ఆగమానుసారంగా బ్రహ్మోత్సవాలు పూర్తి అయిన తరువాత, ద్వాదశరాధన అనే ఒక కార్యక్రమం చేయబడుతుంది. ఇందులో ఈ 12 ఆరాధనలు ద్వాదశనామ పూర్వకంగానే సంకల్పం చేసి, చేయబడతాయి.

శ్రీవైష్ణవుడైనవాడు ప్రతి ఒక్కడుతన శరీరంలో నుదుటి నుండి ఆరంభించి పన్నెండు ఊర్ధ్వపుండ్రాలను ధరించాలి అని నియమం. ఈ 12 పుండ్రాలు కేశవాది ద్వాదశనామ పూర్వకంగానే ధరించాలి అనే నియమం ఉన్నది. ఫాలభాగంలో ధరించే పుండ్రానికి కేశవ నామం. ఉదరం మధ్యలో నారాయణ నామం, హృదయంలో మాధవ నామం, కంఠ ప్రదేశంలో గోవింద నామం, ఉదరానికి కుడివైపున విష్ణు నామం, కుడి చేయి భుజంపై మధుసూదన నామం, కంఠానికి కుడి వైపున త్రివిక్రమ నామం, ఉదరానికి ఎడమవైపున వామన నామం, ఎడమ భుజంపై శ్రీధర్ నామం, కంఠానికి ఎడమవైపున హృషీకేశనామం, వెనుక వైపు నడుమ భాగంలో పద్మనాభ నామం, కంఠానికి వెనుక వైపున దామోదర నామం –అని ఈ విధంగా మన శరీరంలో 12 చోట్ల ధరించే 12 పుండ్రాలకు 12 నామాలు నిర్దేశింపబడ్డాయి.

వైభవేష్టి, సుదర్శన హోమం మొదలైన వైదిక కర్మలను చేసి పూర్తి అయిన తరువాత, చివరలో హోమ సాద్గుణ్యం కోసం మనం చేసే ఆ కర్మ సత్ఫలితాన్ని ఇవ్వడం కోసం కేశవాదిహోమం చేయబడుతుంది. అప్పుడు ద్వాదశ నామాలతో 12 ఆహుతులు అగ్నిలో సమర్పింపబడతాయి. ప్రతి దినంమనం ఆచమనం చేసినప్పుడు ఈ 12 నామాలతో మన శరీరంలోని 12 స్థానాలలో తాకి మనలను శుద్ధి చేసుకుంటాము.

ద్వాదశనామ పంజర స్తోత్రం అనే ఒక స్తుతి ఉన్నది. కేశవాది 12 నామాలను కలిగిన భగవంతుడు మనలను చుట్టూ రక్షించాలి– అని ప్రార్థించే స్తోత్రం ఇది. " పురస్తాత్ కేశవః పాతు చక్రీ జాంబూనదప్రభః, పశ్చాత్ నారాయణః శంఖీ నీలజీమూతసన్నిభః" అని అంటూ ఈ స్తోత్రం ఆరంభం అవుతుంది. ఇది మనం నిత్యం అనుసంధించదగిన స్తోత్రం. 12 నామాలను కలిగిన కేశవాది భగవన్మూర్తులు 12 మంది మన చుట్టూ 12 దిక్కులలో వేంచేసి ఉండి, మనలను రక్షిస్తారు. ఈ విధంగా మన నిత్యజీవితంలో ఎన్నో విధాలుగా వినియోగపడేవి ఈ ద్వాదశనామాలు.

మనకు జాగ్రద్దశ, స్వప్న దశ, సషుప్తిదశ, మూర్ఛ దశ అనే నాలుగు దశలు ఉన్నాయి. మెలకువగా ఉండే దశ జాగ్రద్దశ, కలలు కనే దశ స్వప్న దశ. ఆ కలలను కూడా కనకుండా గాఢంగా నిద్రించే దశ సుషుప్తిదశ. తెలివి లేకుండా కేవలం చైతన్యంమాత్రమే కలిగి ఉండే దశ మూర్ఛ దశ. ఈ నాలుగు దశలలోనూ మనలను కేశవాదిద్వాదశనామాలను కలిగిన భగవన్మూర్తులు 12 మంది ఒక్కొక్క దశను ముగ్గురు ముగ్గురు మూర్తుల క్రమంలో రక్షిస్తున్నారు— అని శాస్త్రాలు తెలుపుతున్నాయి.

ఇందుచేతనే నమ్మాళ్వారులు తిరువాయ్ మొఌ ప్రబంధంలోనూ, పెరియాళ్వార్లు తమ ప్రబంధంలోనూ ఈ 12 నామాలను పురస్కరించుకొని ఒక్కొక్క దశకాన్ని అనుగ్రహించారు. ధేశికులు కూడా ఈ 12 మూర్తుల రూప విశేషాలను తెలియజేస్తూ పన్నిరు నామం అనే ఒక చిన్న ప్రబంధాన్ని రచించారు.

ఈ విధంగా ద్వాదశ నామాలను పలు విధాలుగా ఉపయోగపడే క్రమాలను మనకు పెద్దలు విధించి, తెలియజేయడం తాత్పర్యం ఏమంటే— ఏ విధంగా అయినా మనం ఈ కేశవాదిద్వాదశనామాలను స్మరించి, నోటితో అనుసంధించి, ఆ భగవంతుని అనుగ్రహానికి లక్ష్యం కావాలి —అనే ఉద్దేశంతోనే. దీనిని మనం గమనించి, ఈ పన్నెండు నామాలను భక్తితో నిత్యం అనుసంధించి, భగవదనుగ్రహాన్ని పొందుదాం.

## ఈ ముగ్గురిలో ఒకరం మనం ఎవరూ కావద్దు

శ్రీకృష్ణుడు భగవద్గీతలోని నాల్గవ అధ్యాయంలో 40వ శ్లోకంలో మూడు విధాలైన వ్యక్తులను గురించి ప్రస్తావించాడు. ఈ శ్లోకాన్ని వినగానే మనకు "ఈ ముగ్గురిలో ఎవరు మనం కాము కదా! కాకూడదు కదా! " అనే భావం వెంటనే తోస్తుంది. వారు ముగ్గురు ఎవరు? అంటే, " ఆజ్ఞశ్చ అశ్రద్ధధానశ్చ సంశయాత్మా" అనేవారు వీరు ముగ్గురు. వీరిని గురించి శ్రీకృష్ణుడు పలుకుతూ, "నాయం లోకో ఽ స్తి న పరో న సుఖం సంశయాత్మనః" అని అన్నాడు. ఈ విధంగా చెప్పబడిన ముగ్గురికి ఈ లోకం లేదు, ఈ లోకమే లేదంటే, ఇక పై లోకం అనేది లేనేలేదు, వీరికి సుఖం కూడా లేదు – అని అంటాడు.

మరి ఈ ముగ్గురు ఎవరు? ఎటువంటివారు? అనే విచికిత్స మనకు వెంటనే కలుగుతుంది. వీరిలో మొదటివాడు అజ్ఞుడు, అంటే జ్ఞానం లేనివాడు, ఆత్మను గూర్చిన జ్ఞానాన్ని, పరమాత్మను గూర్చిన జ్ఞానాన్ని ఏమాత్రం లేనివాడు. ఇటువంటివానికి సుఖం లేదు.

మనకు వెంటనే ఈ విధంగా తోచవచ్చు. తెలియకపోవడం అనేది ఒక పెద్ద దోషమా? లోకంలో ఎంతమందికో ఎన్నో విషయాలు తెలియవు. తెలియకపోవడం అంత అపరాధం ఏమీ కాదుకదా–అని. నిజమే, తెలియకపోవడం తప్పు కాదు, కానీ, తెలియలేదు అని తెలిసిన తర్వాత అయినా తెలుసుకోవచ్చు కదా. తెలుసుకోవాలి కదా. తెలుసుకోవాలి అనే ఆశ, ప్రయత్నం, అభినివేశం ఉండాలి కదా. అయ్యో! ఇంత కాలం మనకు తెలియకుండా పోయిందే! అనే కొంచెం అయినా మనసులో బాధ, తెలిసికోవాలి అనే ఆశ, శ్రద్ధ ఉండాలి. అయితే, శ్రీకృష్ణుడు చెప్పిన రెండవవానికి ఇవి కూడా ఉండవు. ఇంతకాలం తెలియలేదే! అనే బాధ ఉండదు. ఇకమీదటైనా తెలుసుకోవాలని అనే శ్రద్ధ ఉండదు. ఇతనిని "అశ్రద్ధధానః "అని అన్నాడు, కృష్ణుడు. మొదట చెప్పినవాడు జ్ఞానం లేని వాడు. రెండవవాడు జ్ఞానం లేదనే బాధ కానీ, తెలిసి తీసుకోవాలి అనే శ్రద్ధ కానీ లేనివాడు.

సరే, పోనివ్వండి. జ్ఞానం లేదు. జ్ఞానాన్ని పొందాలనే శ్రద్ధ కూడా లేదు. ఇతని స్థితిని చూచి ఎవరో ఒక మహానుభావుడు అయ్యో! అని జాలిపడి, ఇతని దగ్గరకు వచ్చి మంచిని బోధిస్తాడు. అతని బోధనను విన్న తర్వాత అయినా, జ్ఞానం కలుగవచ్చు. మనకు జ్ఞానం లేకపోయినా, శ్రద్ధ లేకపోయినా, ఎవరి దగ్గరకి అయినా పోయి తెలిసిపోవాలి– అనే ప్రయత్నం లేకపోయినా, ఎవరైనా ఒక జ్ఞాని వచ్చి మంచిని ఉపదేశించవచ్చు కదా. ఏనాడో ఒకనాడు వారు మనలను కోవెలకు తీసుకొని పోయి, భగవంతుని ముందు నిలుపవచ్చు. మంచిని చెప్పవచ్చు. శ్రీరామాయణంలో ఇటువంటి మంచి విషయాలు ఉన్నాయి, మహాభారతంలో ఇటువంటి చక్కని తెలియదగిన విషయాలు ఉన్నాయి– అని ఆదరంగా చెప్పవచ్చు. ఇటువంటి కార్యాల వల్ల అయినా జ్ఞానం కలుగవచ్చు. కానీ, అప్పుడు కూడా, ఆ విధంగా మనకు మీద జాలితో, ఆదరంతో ఎవరైనా ఒక జ్ఞాని ఉపదేశించిన విషయంలోకూడా నమ్మకం లేకుండా, సందేహపడేవాడు మూడవ వర్గానికి చెందినవాడు. ఇతడే సంశయాత్మ. తనకు బోధించిన విషయాల పట్ల మనసులో ఎన్నెన్నో సందేహాలను పొంది, " ఇతడు ఈ విధంగా చెబుతున్నాడే! ఇది ఏ విధంగా యుక్తం? ఇది ఏ విధంగా తగినది? అని సందేహపడే స్వభావం కలవాడు, ఇతడు. ఎవరికైనా ఇతరులు చెప్పిన విషయంలో ఒక్కొక్కసారి సందేహం కలుగవచ్చు. సందేహం కలుగడం అపరాధం కాదు, కానీ, కలిగిన సందేహాన్ని చెప్పినవారి వద్దనే ప్రశ్నించి, వాస్తవాన్ని గ్రహించవచ్చు. సందేహం తీరినప్పుడు వారు చెప్పిన విషయాన్ని నమ్మవచ్చు. ఈ విధంగా కలిగిన సందేహాన్ని గూర్చి ప్రశ్నించకుండా, సందేహం తీరినపుడు నమ్మకుండా, నిరంతరంగా చెప్పిన విషయాలను నమ్మకుండా మనసులో పలు విధాలుగా సందేహపడుతూ ఉండే స్వభావం కలిగినవాడే సంశయాత్మ. ఇతడు కూడా నశిస్తాడు. ఈ విధంగా ఉండే అజ్ఞుడు, శ్రద్ధ లేనివాడు, నిరంతరం సందేహ పడేవాడు –అనే ఈ ముగ్గురిని గూర్చి గీతలో శ్రీకృష్ణుడు ప్రస్తావిస్తూ, వీరి ముగ్గురికి నాశమే ఫలిస్తుంది. ఈ లోకంగాని, పరలోకంగాని

వీరికి లేవు, వీరికి ఈ లోకంలో సుఖం లేదు, పరలోకంలో సుఖం లేదు, నిరంతరం సందేహపడుతూ నశించి పోవలసినదే — అని అంటాడు.

అందుచేత మనం భావించవలసినది, ప్రయత్నించవలసినది ఏమి? అంటే, ఈ ముగ్గురిలో ఏ ఒక్కరం కూడా మనం కాకూడదు— అని. తెలియని విషయాన్ని ప్రయత్నించి తెలిసికోవాలి. ఆ విధంగా కాకపోయినా, ఇంకా కాలం తెలియనందుకై విచారించి, తెలుసుకోవడం కోసం ఒక జ్ఞాని దగ్గరకు వెళ్లి తెలిసికోవాలి. , ఒకవేళ ఆ విధంగా మనం తెలుసుకోవాలి— అనే ఆశను, శ్రద్ధను, ప్రయత్నాన్ని కలిగి ఉండక పోయినా, ఎవరైనా ఒక జ్ఞాని వచ్చి మంచిని చెప్పినట్లయితే, దానిని సందేహపడకుండా అయినా నమ్మాలి. ఆ విధంగా తెలిసికోకుండా తెలిసికోవాలనే ఆశను, శ్రద్ధను లేకుండా, ఎవరైనా చెప్పినది నమ్మకుండా, నిరంతరం సందేహపడే సంశయాత్మ తప్పక నశిస్తాడు. మనం అంతా తెలుసుకోకపోయినా, తెలియనిదానిని తెలిసికోవాలని ప్రయత్నించడం మంచిది కదా!. పెద్దలు మనకు చెప్పిన దానినిగూర్చి కుతర్కాలు చేయకుండా, సందేహపడకుండా నమ్మడం మంచిది కదా. శ్రీకృష్ణుడు చెప్పిన ఈ ముగ్గురిలో ఎవరూకూడా మనం కావద్దు, కావద్దు, కావద్దు.

# విధియా? కర్మా? కరుణా?

(శ్రీమాన్ వేళుకుక్కుడి కృష్ణన్ స్వామి తమిళ ఉపన్యాసం ఆధారంగా)

ఒక వయస్సైన వ్యక్తి. సుమారు 85 సంవత్సరాల వయస్సు ఉంటుంది. ఆమె ఒక వృద్ధ మహిళ. ఆమెతో నాకు చాలా కాలంగా పరిచయం ఉన్నది. ఒకనాడు నాకు ఆశ్చర్యం కలిగించే రీతిలో ఆమె నాతో ఒక విషయాన్ని చెప్పారు. దానిని మీతో పంచుకుంటున్నాను. వినండి.

సాధారణంగా లోకంలో చాలామంది ఏమని భావిస్తారు? మనకు ఎంతవరకు దైవం ఈ లోకంలో ఉండమని విధించిందో, ఎన్నాళ్లు మనం ఇక్కడ ఉండాలని నియమించిందో, అన్ని దినాలు మనం ఇక్కడ ఉంటాము. ఈ లోకంలో ఉంటాము— అని సాధారణంగా మనం భావించి చెప్పే విషయం. అది చిన్న వయసులో ఉండేవారి విషయంలో అయినా, పెద్ద వయస్సులో ఉండేవారి విషయంలో అయినా సమానమే. విధి అనేది ఒకటి ఉన్నది. దాని ప్రకారం నడుస్తుంది —అని వీరిరి భావన. మరి కొంతమంది ఏమని అంటారు? "అదేమి విధి! విధి అంటే ఏమి? అది ఎక్కడ ఉన్నది? అది నుదుటిలో రాసి ఉందా? నెత్తిలో రాసి ఉందా? ఎక్కడ ఉన్నది? అది కేవలం మనం చెప్పుకోవడానికి మాత్రమే పనికి వస్తుంది. వారు వారు చేసుకున్న కర్మలను అనుసరించికదా జరుగుతుంది. చేసినది పాపం అయినా, పుణ్యం అయినా, ఆ యా కర్మలనుబట్టి జరుగుతుంది. మన కర్మ ఫలం ఎన్ని దినాల వరకు ఉంటుందో, ఎంతకాలం మనకు ఆయుష్షును ఇస్తుందో, అంత కాలం మనం జీవించి ఉంటాము, ఉండాలి కదా! అంతవరకు జీవిస్తాము" అని మరికొందరు అంటారు. ఈ లోకంలో ఇంకా కొంతకాలం ఉండాలి —అనే కోరిక కలిగినవారి విషయంలోనూ ఇది వాస్తవమే. "ఇక ఈ లోకంలో ఉండవద్దు, మనం ఈ లోకాన్ని విడచి వెళ్లిపోవాలి "అని భావించేవారి విషయంలోనూ ఇది వాస్తవమే. "కర్మకు జ్ఞానం ఉన్నది, అది ఒక నిర్ణయాన్ని చేస్తుంది" అని వారు చెప్పడం లేదు. ఈ జన్మలో ఇన్నాళ్లు

జీవించాలి –అనేది కర్మవల్లనే కదా ఏర్పడుతున్నది. అందువల్ల వారు ఆ విధంగా భావిస్తున్నారు, పలుకుతున్నారు.

అయితే, నేను ఇంతకుముందు ప్రస్తావించిన వృద్ధ మహిళ మాత్రం వేరే విధంగా తన అభిప్రాయాన్ని వ్యక్తం చేశారు. . "లేదు! ఈ విధంగా కాదు! నాకు, ఈ రెండు అభిప్రాయాల కంటే వేరొక అభిప్రాయం తోస్తున్నది. భగవంతుడు ఒక్కొక్క వ్యక్తినుండి, ఒక్కొక్క జీవరాశి నుండి కూడా, ఒక్కొక్క విధమైన సేవను కోరుకుంటాడు. ఆ వ్యక్తి సంగీత విద్వాంసుడు కానీ, కోవెలలో సేవ చేసేవాడు కానీ, కంపెనీలో ఉద్యోగం చేసేవాడు కానీ, ఆ వ్యక్తి ఎవరైనా కానీ, అతడి ద్వారా ఒక మంచి పనిని ఇంతకాలం నిర్వహించాలి– అనే అభిప్రాయాన్ని భగవంతుడు కలిగి ఉంటాడు. "దీనిద్వారా ఈ వ్యక్తికి ఒక విషయాన్ని తెలియజేయాలి, ఈ వ్యక్తి ద్వారా లోకానికి ఒక విషయాన్ని తెలియజేయాలి " అని భగవంతుడు భావించవచ్చు. మనం ఒక్కొక్కరం ఈ విషయంగా కొంచెం ఆలోచించాలి. మనం ఏ వృత్తిలో ఉన్నాము? మనలను సాధనంగా చేసుకుని భగవంతుడు ఏ మంచి కార్యాన్ని చేయాలని భావిస్తున్నాడు? ఆ స్వామికి మనం ఏ విధంగా ఒక సాధనంగా కాగలము? ఏ విధంగా అతని మనసుకు నచ్చిన కైంకర్యాన్ని చేయగలము" అని ప్రతి వ్యక్తి ఆలోచించాలి. నన్ను ఇంతకాలం ఈ లోకంలో భగవంతుడు ఉంచాడు అంటే, నా ద్వారా నన్ను సాధనంగా చేసుకొని, ఏదో ఒక పనిని, ఒక మంచి పనిని, చేయించాలని అనుకునే నన్ను ఇక్కడ ఉంచాడు. అతడు ఎంత కాలం నా ద్వారా తాను అనుకున్న పనిని చేయించాలని అనుకున్నాడో, అంత కాలం నేను ఈ లోకంలో ఉంటాను. అంతే తప్ప నా విధి ఉన్నంతవరకు ఉంటాను. నా కర్మ ఉన్నంతవరకు ఉంటాను–. అని నేను భావించడం లేదు– అని ఆమె అన్నది.

నాకైతే చాలా ఆశ్చర్యం కలిగింది. ఆమెను మళ్లీ అడిగాను. " ఏమి! మీ ద్వారా ఏదైనా కార్యాన్ని భగవంతుడు చేయించాలని అనుకుంటున్నాడని మీరు భావిస్తున్నారా? ఆ విధంగా మీరు ఏమి చేస్తున్నారు?" అని అన్నాను. ఆమె అంత

పెద్ద వయసులో కూడా తన మనుమలకు, దగ్గర ఉండే కొంతమంది చిన్నపిల్లలకు మంచి విషయాలను బోధిస్తున్నది. వారిలో, ఆమె మునిమనుమలు ముగ్గురు ఉన్నారు. చుట్టుపక్కల ఉండే పిల్లలు నలుగురు కూడా ఉన్నారు. "వీరు ఏడుగురుకి మంచిని బోధించే కర్తవ్యాన్ని, నా అనుభవాన్ని వారికి తెలియజేసే కర్తవ్యాన్ని, ఆధ్యాత్మిక విషయాలను బోధించే కర్తవ్యాన్ని భగవంతుడు నాపై పెట్టాడు— అని నేను భావిస్తున్నాను. ఈ కర్తవ్యాన్ని నా చేత భగవంతుడు ఎంత కాలం చేయించాలని అనుకుంటాడో, అంత కాలం నేను ఈ లోకంలో జీవిస్తాను. "లేదు, ఈ కార్యాన్ని ఇంతకంటే వేరొకరు చక్కగా చేయగలరు"— అని అతడు భావించినప్పుడు, నేను ఈ లోకంలోనుండి నిష్క్రమిస్తాను. ఇదే నా మనసులో తోచిన అభిప్రాయం, నిర్ణయం" అని ఆమె అన్నారు.

ఈ విధంగా చూసినప్పుడు "భగవంతుని కృప మూలంగా నాకొక పని దొరికింది. ఎంతకాలం నన్ను ఉపయోగించి ఆ పనిని చేయాలని అనుకుంటాడో, అంతకాలం నేను ఈ లోకంలో ఉంటాను" అని ఈమె భావిస్తున్నది— అనేది స్పష్టమైనది.

"కర్మ. విధి నియమించినంత కాలం ఈ లోకంలో నేను ఉంటాను" —అని భావించడం ఒక క్రమం. ఇది సాధారణమైన క్రమం. "భగవంతుడు నన్ను ఉపయోగించుకుని ఎంతకాలం తాను తలచిన కైంకర్యాన్ని చేయించుకుంటాడో, అంతకాలం నేను ఈ లోకంలో ఉంటాను" అని అతడు తన కరుణతో ఈ లోకంలో నన్ను ఉంచాడు అని భావిస్తే, అది ఉన్నతమైన క్రమం.

అంత ముదుసలి వయస్సులో ఉండే ఆమె కూడా ఎంత ధైర్యంతో ఆమె ఈ విధంగా చెప్పిందో కదా! అని నాకు చాలా ఆశ్చర్యం కలిగినది. మనకు ఏ వయసులోనైనా ఇటువంటి భావన మనస్సులో కలిగిందా? కలుగుతుందా? సందేహమే! కానీ, ఆమెకు అటువంటి నిశ్చయం జ్ఞానం ఉన్నది.

దీనివల్ల మనకేమి బోధపడుతున్నదంటే –ఈ లోకంలో ఎవరైనా కానీ ఏ విధంగా భావించాలి? అంటే, మనం ఈ లోకంలో ఇంకా జీవించి ఉన్నామంటే, మన ద్వారా భగవంతుడు ఏ మంచి కార్యాన్ని చేయించాలని అనుకుంటున్నాడు? అని ఆలోచించాలి –అని

# సిగ్గుపడేవారు ఎవరు?

(ఉ. వే. శ్రీమాన్ వేళుక్కుడి కృష్ణన్ స్వామివారి తమిళ ఉపన్యాసం ఆధారంగా)

"సిగ్గుపడుతున్నారా ?ఎందుకు సిగ్గు పడడం? ధైర్యంగా జీవించండి" అని ఈ విధంగా అందరూ అనే మాట. వాస్తవానికి కొన్ని సందర్భాలలో మనం సిగ్గుపడవలసి వస్తుంది. ఇక్కడ నేను ప్రస్తావించే సిగ్గు లక్షణ గ్రంథాలలో చెప్పబడిన లజ్జ గురించి గాని, కావ్యాలలో వర్ణించబడిన లజ్జను గురించి గానీ కాదు. అది చాలా గొప్పది. మన దైనందిన జీవితంలో మనకు ఎదురయ్యే కష్టనష్టాలకు మనం పొందే సిగ్గును గురించి ఇక్కడ ప్రస్తావిస్తున్నాను. ధర్మాన్ని అతిక్రమించినప్పుడు మనం సిగ్గుపడవలసి వస్తుంది. అధర్మంగా ప్రవర్తించినప్పుడు గాని, ఆచరించవలసిన ధర్మాన్ని ఆచరించకుండా పోయినప్పుడు గాని, సిగ్గుపడవలసి ఉంటుంది కదా. " అయ్యో! ఈ విధంగా ప్రవర్తించామే! "అని సిగ్గుపడవద్దా. అయితే, మన వంటి మానవులు ఇటువంటి సందర్భాలలో కూడా సిగ్గు పడమట.

మరి, సిగ్గుపడేవారు ఎవరు? అనే ప్రశ్నకు సమాధానంగా ఒక సందర్భం ఉదాహరింపబడుతున్నది. పంచపాండవులకు సిగ్గు లేదు. భీష్ముడు, ద్రోణుడు మొదలైన వారికి సిగ్గు లేదు. ధృతరాష్ట్ర మహారాజుకు సిగ్గు లేదు. దుర్యోధనుడు, దుశ్శాసనుడు, కర్ణుడు మొదలైన వారికి కూడా సిగ్గు లేదు. వీరు అందరూ కూడా ద్రౌపది అవమానపడడంలో భాగస్వామ్యం పొందినవారే. పాండవులను మాయాజూదంలో ఓడించడమే కౌరవుల సిగ్గులేని పని. అంతకుమించి, ఒక స్త్రీని నిండు సభలో అవమానించడం అంతకుమించిన సిగ్గులేని పని.

. "మేము కౌరవులకు ఓడిపోయాము. అందువల్ల ఏమీ మాట్లాడకూడదు " అని ద్రౌపది అవమానాన్ని చూస్తూ ఊరుకొని పంచపాండవులు ఉండడం వారి సిగ్గు లేని పని. ఆ విధంగా వారు వర్తించటం న్యాయమా? అధమ పక్షం, , ద్రౌపది భగవంతుని శరణు

వేడిన తర్వాత అయినా, "ఒక భాగవతోత్తమురాలకు అవమానం జరుగుతున్నది, ఒక స్త్రీకి అవమానం జరుగుతున్నది, దానిని అడ్డుకోవాలి" –అని వారు ప్రయత్నించలేదు. అందుచేత వారికి సిగ్గు లేదు.

ధృతరాష్ట్రుడు ప్రభువు ఒక ప్రభువు. తన ముందు ఆ విధంగా అధర్మం జరగవచ్చునా ?దానిని ప్రభువు అడ్డుకోవద్దా? ప్రభువై ఉండి అధర్మం జరుగుతూ ఉంటే, అతడు ఊరికే ఉన్నాడు కదా! అందుచేత అతనికి సిగ్గు లేదు.

భీష్ముడు, ద్రోణుడు మహావీరులు. భీష్ముడు పాండవులకు, కౌరవులకు పితామహుడు. ద్రోణుడు వారికి సాక్షాత్తు ఆచార్యుడు. కానీ, వారు అధికారానికి కట్టుబడిపోయారు. "ప్రభువే ఊరికే ఉన్నప్పుడు, మనమేమి చేయగలము?"అని వారు ఉదాసీనంగా ఉండిపోయారు. ఈ విధంగా ఆ సభలో ఉండే అందరికీ సిగ్గులేకుండా పోయింది.

ధర్మానికి అవమానం జరుగుతూ ఉంటే, ఒక స్త్రీ అవమాన పడుతూ ఉంటే, ఎవ్వరు అడ్డుకోలేదు ఎవరికి సిగ్గు లేకుండా పోయిందికదా! అయితే, మంచి సమయం, సిగ్గుపడేవాడు కనీసం ఒకడైన ఉన్నాడు. అతడే భగవంతుడు. అతడు ధర్మాన్ని వాడనివ్వడు.

సభలో ఎవ్వరూ తన అవమానాన్ని అడ్డుకోకపోవడం అధర్మం జరుగుతూ ఉంటే ఊరికే ఉండడం గమనించిన ద్రౌపది, "ఈ విధంగా నన్ను అవమానిస్తున్నారే! ఇక్కడ న్యాయం అడిగేవారు ఎవ్వరు లేరా? ఇప్పుడు నేను ఎవరిని అడగాలి? ఎవరి దగ్గర మొరపెట్టుకోవాలి? "అని ఆలోచించింది. న్యాయాన్ని, ధర్మాన్ని నిర్వహించేవాడు, ధర్మం వర్తించకపోతే బాధపడేవాడు, సిగ్గుపడేవాడు ఎవడున్నాడో, అతడి దగ్గరే కదా అడగడానికి సాధ్యం అవుతుంది. ఇక్కడ ఉండే వీరెవరికీ సిగ్గు లేదే! అందుచేత, ఆమె ఒక

నిర్ణయానికి వచ్చింది. "ఇక్కడ ఉండే వారికి సిగ్గులేదు. కనుక సిగ్గుపడే వానిని అన్వేషించి, అతనిని ప్రార్థిద్దాం. అతడే కదా ధర్మం ప్రవర్తించకపోతే సిగ్గుపడతాడు. ఈ ప్రపంచంలో ధర్మం జరగకపోతే సిగ్గుపడేవాడు, బాధపడేవాడు ఒకడే ఉన్నాడు, అతడే భగవంతుడు. భగవంతుడైన శ్రీకృష్ణుడు"— అని అనుకున్నది. ఆ స్వామినే ద్రౌపది ప్రార్థించింది కూడా.

భగవంతునికి ఏమి సిగ్గు? అని అనుకుంటున్నారా? మిగిలిన ఏ విషయాలునుగురించి ఆ స్వామికి సిగ్గుపడవలసిన అక్కరలేదు, కానీ, తన భక్తుని రక్షించడం అనేది తన బాధ్యత కనుక, భక్తుడు ఒకడు ప్రార్థిస్తే, అతనిని రక్షించవలసిన బాధ్యత ఆ స్వామిది. కనుక భక్తరక్షణ సరిగా జరగకపోతే, భగవంతుడు చాలా బాధపడతాడు. సిగ్గుపడతాడు కూడా.

భగవంతుడు ఈ విధంగా సిగ్గుపడడం అనేది కూడా ఉన్నదా? భగవంతుడే కదా ఈ లోకాన్ని సృష్టించాడు. సృష్టించినవాడు రక్షించ వద్దా! రక్షించమని ప్రార్థించకపోతే సరే, ద్రౌపది రక్షించమని ప్రార్థించింది కూడా కదా! ఆ తరువాత కూడా భగవంతుడు రక్షించకపోతే అది ఆయనకు సహించే విషయం కాదు కదా! ఈ విషయాన్ని అంతటినీ గుర్తించింది ద్రౌపది. అందుచేత, "ఆ శ్రీకృష్ణ భగవానుడే నా రక్షణ కోసం తప్పక వస్తాడు, రక్షిస్తాడు"— అని నిశ్చయం చేసికొని, "రక్ష మాం శరణాగతామ్" అని ప్రార్థించింది. ద్రౌపది భావించినట్లుగానే భగవంతుడు ఆమెకు వస్త్ర దానం చేయడం ద్వారా రక్షణను కలిగించాడు. ఆమె మాన సంరక్షణను చేశాడు.

ఈ విధంగా పరోక్షంగా వస్త్రాలను ఇచ్చి మాన సంరక్షణ చేయడం కాకుండా, నేరుగా శ్రీకృష్ణుడే వచ్చి ఉండవచ్చు కదా! అని అనవచ్చు. ఆ విధంగా శ్రీకృష్ణుడే నేరుగా కౌరవ సభకు వచ్చి ఉంటే, అక్కడ ఉండే అందరిని వధించవలసి ఉంటుంది. అందరూ భాగవతాపచారం చేసినవారే కదా. , మిగిలిన అందరినీ సంహరించడం సరే, కానీ,

పాండవులను సంహరిస్తే, ద్రౌపది మాంగల్యానికి భంగం కలుగుతుంది. అందుచేత భగవంతుడు, "సరే! ప్రస్తుతం ఈమెకు పరోక్షంగానే రక్షణను కలిగిస్తాను. ఆ తరువాత యుద్ధం జరగనున్నది కదా! " అని భావించి, ఆ విధంగా చేశాడు.

దీనివల్ల మనకు ఒక విషయం తెలుస్తున్నది. ఈ లోకంలో చేయవలసిన కర్తవ్యాన్ని చేయకపోతే సిగ్గుపడేవాడు ఎవడు తెలుసా ?అతడు భగవంతుడు ఒక్కడే!. మనం ఏదో సాకును చెప్పి తప్పించుకోవడానికి ప్రయత్నం చేస్తాము. అంతే తప్ప, మనః పూర్వకంగా సిగ్గుపడము. కానీ, భగవంతుడు ఆ విధంగా ఏ సాకును చెప్పడు. మోసగించడం అనే పనిని ఎంత మాత్రం చేయడు. ప్రహ్లాదుడు ప్రార్థించినప్పుడు వచ్చాడు. గజేంద్రుడు ప్రార్థించినప్పుడు వచ్చాడు. ద్రౌపది ప్రార్థించినప్పుడు ఆమెకు మానసంరక్షణను చేశాడు.

దీనివల్ల ఒక విషయం స్పష్టమైనది. మంచి కాలం! ఈ లోకంలో ధర్మం వర్తించకపోతే సిగ్గుపడేవాడు కనీసం ఒక్కడైనా ఉన్నాడు కదా! అందువల్లనే, అతడి వల్లనే మనం జీవించగలుగుతున్నాం. నమ్మకంగా ఉండగలుగుతున్నాం.

## ఆళ్వారుల పాశురాలను అనుసంధించడం ఎందుకు?

సామాన్యంగా ఆళ్వారులు పాశురాలను పాడేటప్పుడు చాలా విరక్తితో పాడుతారు. సంసారం పట్ల విరక్తిని, సంసారుల విషయంలో వెగటును ప్రకటించడం, బంధువుల విషయంలో, స్నేహితుల విషయంలో విరక్తిని వ్యక్తం చేయడం, ధనం ఏ విధంగానూ ఉపయోగపడదు అని అనడం, బంధువులెవ్వరూ రక్షించరు, ఈ సంసారమే ఒక మాయ, భగవంతుడు ఒక్కడే మనలను రక్షిస్తాడు అని ఈ విధంగా ఉండే భావాలను పలు పాశురాలలో వారు వ్యక్తం చేయడం గోచరిస్తుంది. అది ఏ సంప్రదాయానికి సంబంధించిన భక్తులైనా, కవులైనా, వారు లోకులను అన్వేషించకుండా, ఆశ్రయించకుండా, భగవంతునే అనుభవిస్తున్నట్లు, ఆశ్రయిస్తున్నట్లు కనిపిస్తుంది, ఆ విధంగానే వారు పలుకుతారుకూడా.

. అయితే, ఇటువంటి పాశురాలను, శ్లోకాలను, పద్యాలను చదివేటప్పుడు మనకు మనస్సులో చాలా పెద్ద సందేహమే కలుగుతుంది. మనమైతే సాంసారిక జీవనంలో నిత్యం ఆసక్తిని కలిగి ఉన్నాము. కానీ మనం ఈ అళ్వా, ర్లు భక్తులు మనకు అందించిన ఈ పాశురాలను పద్యాలను చదువుతున్నామే! వీటికి, మన జీవన యాత్రకు ఏ రీతిలో అయినా సరిపోతుందా? ఏ రీతిలో అయినా సంబంధం ఉన్నదా? మనకు ఏ విధంగా అయినా పొసగుతుందా? లేక, కేవలం సాహిత్య పరమైన దృష్టితోనే చదువుతున్నామా? ఈ ఆళ్వారులకు, భక్తులకు ఉన్నట్లు కనిపించే వైరాగ్యం, భక్తి మనకు కలిగేటట్లు, ఏ సమయంలోనూ సిద్ధించేటట్లు కనిపించడం లేదే! అనిపించడం లేదే! సరే, వీటిని ఏదో చదవాలి కాబట్టి చదువుతున్నాము, వినాలి కాబట్టి వింటున్నాము, అంతే, ఇవి మన జీవన యాత్రకు ఏమైనా ప్రయోజనకరంగా ఉంటాయా?

ఆళ్వారులను గమనిస్తే, వారిలో చాలామందికి వివాహం కాలేదు. ముదలాళ్వార్లు ముగ్గురు, తిరుమళిశై ఆళ్వార్లు, నమ్మాళ్వారులు తొండరడి ప్పొడి ఆళ్వారులు, తిరుపాణ్ ఆళ్వారులు –వీరు ఎవరూ వివాహం చేసికోలేదు. మిగిలిన ఆళ్వార్లకు వివాహమైనది, సంతానం కూడా ఉన్నదని వింటున్నాము అందువల్ల, వారి జీవన విధానమే వేరు, మన జీవన విధానం వేరు, ఇటువంటి, విభిన్నమైన జీవన విధానాన్ని కలిగినవారైన వారు రచించిన పాశురాలను మనం ఎందుకు చదవడం? చదివితే మనకు ఏమి ప్రయోజనం? మనవలె కుటుంబ జీవనంలో ఉండేవారు ఈ పాశురాలను పాడినపుడు, వాటిని మనం చదివితే, ఉపయోగముంటుంది. అప్పుడు వాటిని మనం అంగీకరించవచ్చు –అని ఈ విధంగా మన మనసులో సహజంగా ఎన్నో సందేహాలు తోచవద్దు. ఇవి న్యాయమైన సందేహాలే, వీటికి తగిన సమాధానాలను ఆలోచించవలసినదే– అనే విషయంలో ఏ సందేహం లేదు.

ఈ విషయాన్ని మనం రెండు రీతులుగా గమనించవచ్చు అందులో ఒకటి ఏమంటే –

గొప్ప అధికారులై, ప్రభువులై ఉండేవారే గొప్ప జ్ఞానులై అపారమైన జ్ఞానాన్ని, విరక్తిని కలిగినవారై మెలిగినవారు, వెలిగినవారు ఎందరో ఉన్నారు. పూర్వం జానశ్రుతి అనే పేరు గల ఒక రాజు ఉండేవాడు. ఉపనిషత్తులలో ఇతనికి సంబంధించిన వృత్తాంతం ప్రస్తావించబడింది. ఇతడు గొప్ప పండితుడై, గొప్ప జ్ఞాని అయ్యాడు బ్రహ్మజ్ఞానాన్ని పొందాడు –అని ఇతని చరిత్ర తెలుపుతున్నది. అతడు ప్రభువై ఉండగానే ఇంతటి జ్ఞానాన్ని పొందాడు. ఆ విధంగానే, సీత తండ్రి జనక మహారాజు గొప్ప పండితుడు, కర్మయోగి. ఇతడు కూడా ప్రభువే. అందుచేత జ్ఞానులు బ్రాహ్మణులై ఉండి తీరాలి అనే నియమం లేదు. ఈ విధంగా ఉండే జ్ఞానులు, లోకం పట్ల విరక్తిని గలవారు అన్ని జాతులలోనూ జన్మించారు. అందుచేత ఇది అంతా వారి వారి మనోభావాలకు సంబంధించిన ఉంటుంది తప్ప, వారి జన్మకు, విద్యకు సంబంధించినదిగా ఉండదు. ఇదే విధంగా ఖాండిఖ్య కేశిధ్వజ సంవాదం అనే ఒక వృత్తాంతం మనకు శ్రీవిష్ణు పురాణంలో

కనిపిస్తుంది. ఈ ఇద్దరూ కూడా క్షత్రియులే. గొప్ప ప్రభువులే. అయితే, వీరిద్దరూ మాట్లాడుకునే కర్మయోగాన్ని గురించి, జ్ఞాన యోగాన్ని గురించి గమనించినప్పుడు, మనకు చాలా ఆశ్చర్యం కలుగుతుంది ఈ విధంగా జానశ్రుతి, జనకుడు, ఖాండిఖ్య కేశిధ్వజులు —వీరంతా ప్రభువులే, అధికారులే. . ఈ సంసార జీవనాన్ని గడిపినవారే. కేకయ రాజు అశ్వపతి అనే ప్రభువు ఒకడు ఉండేవాడు. అతని దగ్గరకు ఎంతోమంది ఋషులు వచ్చేవారు. తమకు గల సందేహాలను తీర్చుకునేవారు. మహర్షుల సందేహాలను తీర్చగలిగినట్టి బ్రహ్మజ్ఞానాన్ని అతడు కలిగినవాడు. రాజర్షులు అని మనం కొంతమందిని పురాణాలలో వింటుంటాం. మొదట విశ్వామిత్రుడు కూడా రాజర్షి. వీరంతా క్షత్రియులు. ఇంకొక వైపు చూస్తే, బ్రాహ్మణుడైన వశిష్ఠుడు కూడా గొప్ప బ్రహ్మజ్ఞాని. అతనికి వివాహమైనది. శక్తి అనే కుమారుడు గలిగాడు. శక్తి చిన్నతనంలో ఉండగానే మరణించారడు. తన కుమారుని మరణానికి వశిష్ఠుడు చాలా చింతించాడు —అని అతని చరిత్రలో తెలుసుకుంటున్నాం

ఇందువల్ల, " ఆళ్వార్లకు వివాహం కాలేదు. , కుటుంబ జీవితంలో వారికి సంబంధం లేదు. వారికి మన కష్టనష్టాలు తెలియవు. అందువల్ల వారు ఈ విధంగా విరక్తితో పాడుతున్నారు" అని అనడానికి లేదు. కుటుంబ జీవనంలో ఉన్నవారై, కూడా ఎంతో జ్ఞానం కలిగినవారై, విరక్తితో ఉన్నవారు ఎందరో ఉన్నారు— అని మనకు తెలుస్తున్నది కదా. వారి చరిత్రలను కూడా మనం చదివి తెలుసుకోవచ్చు

మరి ఒక కోణంలో చూసినట్లయితే, ఆళ్వారుల ఉన్నతమైన భావాలు కలిగిన పాశురాలను మనం అనుసంధించినప్పుడు, ఇప్పుడే మనకు ఈ లోకం నుండి వెళ్లిపోవాలని, మనం చాలా వెనకబడి ఉన్నామని, మనకు ముక్తి అందని ద్రాక్ష పండు అని తోస్తుంది. ఆ విధంగా భావించి, మనసులో కుమిలిపోవడం, మనం చాలా కోల్పోయాము అని బాధపడడం చేసినందు వల్ల ఏ ప్రయోజనం లేదు. "ఓడిపోయాము, మనం జీవితంలో ఓడిపోయాము. ఇక లాభం లేదు" అని విరమించడం కూడా

చేయకూడదు. ఆళ్వారుల పాశురాలను భక్తితో, ఆదరంతో చదవడం వల్ల, అందులోని భావాలను మాటిమాటికి మననం చేయడం వల్ల మనకు ఆ ఆళ్వారుల అనుగ్రహించేత వారి సమీపానికి మనం కొంతవరకైనా చేరగలుగుతాం. మానసికంగా పూర్తిగా వారి సమీపానికి చేరగలగడం కానీ, పూర్తిగా వారివలె కావడం కాని మనకు సాధ్యం కాదు, నిజమే. కానీ వారి పాశురాలను భావించడం వల్ల ఎక్కడికో తెలియని, దిశ తెలియని రీతిలో సాగిపోతున్న మన జీవితానికి కొంతవరకైనా ఒక గమ్యం ఏర్పడుతుంది. ప్రయోజనం చేకూరుతుంది. "ఆళ్వార్ల అంతవారు అయినప్పుడే మోక్షం ఇస్తాను "అని భగవంతుడు భావించడు. ఆ విధంగా అతడు పట్టుదల పట్టడు. ఎటువంటి వారికి అయినా ముక్తిని అనుగ్రహించే దయామయుడు, అతడు. అయితే, అతడు ఒక విషయాన్ని మాత్రం తప్పక చూస్తాడు. మనం ఆళ్వార్ల వంటి ఆ పరమ భక్తుల విషయంలో ఎటువంటి భావాన్ని కలిగి ఉన్నాము? ఎంత అనుకూల్యాని కలిగి ఉన్నాము? అని చూస్తాడు. వారి విషయంలో భక్తిని, గౌరవాన్ని కలిగి ఉన్నామా? అని గమనిస్తాడు. మనకు ఎంత వైరాగ్యం ఉన్నది? ఎంత జ్ఞానం ఉన్నది? అని అతడు చూడడం అనేది రెండవ పక్షం. అంతకంటే, మనకు ఆళ్వార్ల విషయంలో, ఆచార్యుల విషయంలో ఎంత భక్తి ఉన్నది? అని గమనించి చూస్తాడు. వారిని మనం ప్రీతితో సంభావిస్తున్నామా? దైవంతో సమానంగా సంభావిస్తున్నామా? వారి భక్తుల విషయంలో ఆదరాన్ని కలిగి ఉన్నామా? గౌరవిస్తున్నామా? అని చూస్తాడు. అందువల్లనే మనం భక్త శిరోమణుల చరిత్రలను చదవడం చేస్తున్నాము. అంతే తప్ప. ఈ పాశురాలను మనం కేవలం సాహిత్య పరమైన గౌరవాన్నే చూచి ఆదరిస్తున్నాము— అని అనుకోకూడదు. ఈ పాశురాలను మనం చదువగా, చదువగా తప్పక ప్రయోజనం సమకూడుతుంది. మన జీవితానికి ఒక గమ్యం దొరుకుతుంది. పరమార్థం చేకూరుతుంది. పరమ పురుషుని అనుగ్రహం లభిస్తుంది. సందేహం లేదు. ఆళ్వారుల పాశురాలను భక్తితో, ఆదరంతో అర్థానుసంధాన పూర్వకంగా అనుసంధానం చేద్దాం. రండి. ప్రయత్నించండి.

# హనుమ శబ్దస్వరూపుడు

(ఉ. వే. శ్రీమాన్ శ్రీ భాష్యం అప్పలాచార్యస్వామివారి ఉపన్యాసం ఆధారంగా)

రామాయణరహస్యజ్ఞం రమ్యవాక్యవిశారదమ్,
అనంతగుణసంఘాత మప్పలార్య మహం భజే.

హనుమ ఒక మంత్ర స్వరూపుడు, హనుమ గురుస్వరూపుడు. మంత్రమే హనుమ. ఎందుచేత? ఆ లోకంలో ఉండేటప్పుడు శ్రీమన్నారాయణుని గరుత్మంతుడు వహిస్తాడు. ఆ స్వామి ఎక్కడికి వెళ్ళినా గరుడుని ఎక్కి వెడుతూ ఉంటాడు అని చెబుతూ ఉంటారు, కథలలో. ఏమిటి ఈ హవాహనాలు? ఒకాయనకు ఎద్దు వాహనం, ఒకాయనకు హంసపక్షి వాహనం, ఒకాయనకు గరుత్మంతుడు వాహనం. ఏమిటండీ! ఏమిటో! ఈ దేవుళ్ళు ఎక్కితే, ఇవి ఎలా నిలబడతాయి? అని మనకి ఏమీ బుద్ధికి అందదు. ఏమిటి ఇవి? అంటే, ఆ వీటికి వేదాన్ని నిరూపకంగా చూపిస్తున్నారు. వేదంచేత వహింపబడి, మన దగ్గరకు వచ్చేవాడు భగవంతుడు. నీకు కావాలా భగవానుడు? ఒకసారి ఒక మంత్రాన్ని ఆశ్రయించు. ఆ మంత్రాన్ని మనసులో భావన చేస్తే భగవానుడు దానిమీద ఎక్కి నీ లోపలకు వస్తాడు. అనగా, భగవానుని మోసి తెచ్చి మనకు అందించేది వాహనం. అటువంటి వాహనమే ఈ శబ్దం. శబ్దాన్ని మనవారు వృషభంగా, గరుత్మంతునిగా నిరూపించారు అందుచేతనే, శివాలయానికి వెళితే నందీశ్వరుడు ఉంటాడు. విష్ణ్వాలయానికి వెళితే గరుత్మంతుడు ఉంటాడు. "వేదాత్మా విహగేశ్వరః" అయిన ఆయన సుపర్ణుడు, ఆయన ఛందఃస్వరూపుడు. ఆ వేదఅస్వరూపుడైన గురుత్మంతుని అధిరోహించి, భగవానుడు వస్తాడని విష్ణ్వాలయంలో ముందుగా గరుత్మంతుని చూపిస్తారు.

వృషభం వేదస్వరూపం. " చత్వారి శృంగాః త్రయో అస్య పాదాః ద్వే శీర్షే సప్త హస్తాసో అస్య, త్రిధా బద్ధో వృషభో రోరవీతి మహోదేవో మర్త్యాగ్ మ్ ఆవివేశ" అనే ఒక మంత్రం. ఆ మంత్రానికి పతంజలి వ్యాఖ్యానం చేస్తూ, శబ్దమే ఆ వృషభం అని అన్నాడు.

ఆ శబ్దమనే వృషభాన్ని అధిరోహించి శివుడు వస్తాడు కనుక, ఆయన్ని సేవించడానికి ముందు ఈ వృషభాన్ని సేవించాలి.

ఆ విధంగానే భగవంతుని సేవించాలి అంటే, ముందు గరుత్మంతుని సేవించాలి. అందువల్లే, ఆ యా ఆలయాలకు ముందు గరుత్మంతుని, వృషభాన్ని ఉంచుతారు.

శివాలయానికి వెళితే మరొక లాంఛనం ఉన్నది. ఇక్కడ నమస్కారం చేసి వెళితే చాలదు. నంది కొమ్ముల మీద కొంచెం వంగి, వేళ్ళు పెట్టి, వాటి మధ్యలో నుండి చూస్తూ, శివలింగాన్ని దర్శనం చేయాలి. . ఏమిటండీ ఇది? అంటే, ఇదే మనం నేర్చుకోవలసినది. ఇక్కడ మనకు పైన పెట్టినవాటికి అన్నిటికి అర్థం తెలిస్తే గాని, లోపలివాని అర్థం తెలియవు. బయట నందికొమ్ములు రెండు కనిపిస్తాయి. కొమ్ములు కాదు అవి. "చత్వారి శృంగాః" అని కొమ్ములు నాలుగు. రెండు కొమ్ములే బయటకు కనిపిస్తాయి. ఇంకో రెండు కొమ్ములు లోపల ఉన్నాయి. అదేమిటి? ఎద్దుకు నాలుగు కొమ్ములు ఏమిటి? అంటే, అవి శబ్దాలు. మీరు కొంచెం మెల్లగా అనుకుంటే, లోపల వినిపించే శబ్దం ఒకటి, బయట వినిపించే శబ్దం ఇంకొకటి– అని రెండు శబ్దాలు ఉన్నాయి. వాటి వెనుక, నాభి ప్రదేశంలోనూ, నాభి కింద, ఇంకా రెండు శబ్దాలు ఉన్నాయి. ఆ కింద ఉండే శబ్దం ఎవరికి వినిపించదు. నిర్వికల్పసమాధిలో యోగులు మాత్రమే దానిని దర్శించగలరు, శ్రవణం చేయగలుగుతారు. దానికి పరా అని పేరు. నాభిస్థానానికి వచ్చిన తరువాత వినిపించే శబ్దానికి పశ్యంతీ అని పేరు. దీనిని సవికల్ప సమాధిలో యోగులు వింటారు. పైకి వచ్చిన తరువాత, మనం ఉపాంశువుగా అక్షరాలను వినపడకుండా మెల్ల మెల్లగా లోపల అనుకున్నా కాని, మనకు మాత్రమే, మన చెవులకే, వినబడేటట్టుగా, మన లోపల ఉచ్చరిస్తే వచ్చే ధ్వని పేరు మధ్యమా. ధ్వనిని ఉచ్చరిస్తే, ఈ నాలుక, పెదవులు, దంతాలు మొదలైనవి అన్నీ ఒకదానికి ఇంకొకటి తగిలి వచ్చే గాలిని ధ్వనులుగా బయటకి పంపిస్తే వచ్చే శబ్దానికి వైఖరి అని పేరు. ఈ వైఖరి అనే శబ్దమే మనకు వినబడుతుంది. ఈ విధంగా మధ్యమా, వైఖరి అనే

రెండు శబ్దాలే బయటకు వినిపిస్తాయి. "ఆ శబ్దాల పైన, నీ చేయి పెట్టు లోపలికి చూడు, అంటే, శబ్దం ద్వారా భగవంతుని చూడు. అంతే తప్ప, వెళ్లగానే, నేరుగా అలా చూడకు. ఏదో కనిపించింది కదా అని దండం పెట్టకు. " అని ఇక్కడ సూచించడమే ఉద్దేశ్యం. .

ముందు ఆ ధ్వజస్తంభం దగ్గరకు వెళ్ళు. నమస్కరించు. ఆ తరువాత భగవంతుని దర్శించు. లేకపోతే, ధ్వజస్తంభం దగ్గరకు వెళ్లి ఆ విధంగా వంగడం ఎందుకు, తిన్నగా లోపలకు పోకుండా? ధ్వజస్తంభం దగ్గర వంగి దండం పెట్టాలి. అందుచేత, " ఓ వేదమా! గరుత్మన్! భగవన్! నీ అనుగ్రహంతో, నీచే వహింపబడే, ఈ లోకంలోకి వచ్చిన భగవానుడు ఈ ఆలయంలోపల ఉన్నాడు. ఆయన మాకు దర్శనం ఇచ్చేటట్లు అనుగ్రహించు" అని ప్రార్థించు. అప్పుడు ఆ భగవంతుని దర్శనం లభిస్తుంది. భగవంతుడు నీకు దర్శనమిస్తాడు.

నేరుగా లోపలికి వెడితే, మ్యూజియంలో ఉండే విగ్రహాన్ని చూసినట్టు చూస్తావు కానీ, భగవత్తత్వం నీకు దర్శనం కాదు. లోపల స్వామి దర్శనం కలగాలంటే, ఆ స్వామి, ఆ స్వామి అని అనిపించాలంటే, ఈ వేద పురుషుని అనుగ్రహం కావాలి. అది మనకు తెలియజేయడం కోసం గరుత్మంతుని దేవాలయంలో పెట్టారు.

మరి, ఇక్కడకు భగవంతుడు ఈ లోకంలోకి శ్రీరాముడుగా దిగి వచ్చాడు కదా ఎలాగండి మరి? అంటే, వచ్చాడు మా హనుమంతుడు. "స్వామీ! నా భుజం మీద కూర్చో" అన్నాడు ఎక్కడైనా ఉందండి ఈ విచిత్రం! కోతిమీద ఎక్కే చక్రవర్తి ఎవడైనా ఉన్నాడా! కాని, ఎక్కాడు, మా రామచంద్ర ప్రభువు. కోతిని అధిరోహించాడు. ఏమిటిది? ఇది కోతి కాదండి. . ఈ హనుమంతుడు శబ్దస్వరూపుడే. మంత్రస్వరూపుడు ఈయనను అధిరోహించాడు, శ్రీరాముడు.

ఈ కోతి ఎలా పుట్టింది? ఆంజనేయ స్వామి జన్మను ఒకసారి తెలిస్తే, మంత్రం ఏ విధంగా ప్రాదుర్భవిస్తుందో తెలుస్తుంది. మహాపురుషులైన యోగులు, ఋషులు సమాధిలో కూర్చుంటే, లోపల నుండి శబ్దం వస్తుంది. శబ్దం అనేది ఎప్పుడూ ఉంటుంది. నిత్యమైనది శబ్దం, అఖండమైనది శబ్దం. "ఇటువంటి భావాన్ని ఆవిష్కరించాలి" అనే సంకల్పం కలగగానే, సంకల్పరూపమైన ఆ గాలి వెళ్ళి, శబ్దాన్ని కొడుతుంది. ఏ కెరటాలు లేని నీటిలో ఒక రాయి వేస్తే, ఏ విధంగా ఆ నీటిలో తరంగాలు వస్తాయో, ఆ విధంగానే వాయువు చేత కొట్టబడిన శబ్దంలోనుండి తరంగాలు వస్తాయి. ఆ తరంగాలు విధంగా పైకి ఉబుకుతాయి. అవి క్రమంగా బొడ్డు దగ్గరికి, హృదయ సీమకు, కంఠం దగ్గరకు వచ్చి, క్రమంగా పైకి ఎగసిపోతాయి. శిరస్సుకు తరవాత పైకి వెళ్లే మార్గం లేదు. కనుక, మళ్ళీ కిందకు కంఠసీమకు వస్తాయి. వాటిని, వోకల్ కార్డ్స్ అంటామే, అవి అడ్డుకుంటాయి. అప్పుడు నోటినుండి అవి బయటకు వస్తాయి. కంఠ సీమ నుండి కొన్ని అక్షరాలు, అంగడి నుండి కొన్ని అక్షరాలు, నాలుక నుండి కొన్ని అక్షరాలు, దంతాలనుండి కొన్ని అక్షరాలు, పెదవుల నుండి కొన్ని అక్షరాలు, ముక్కు నుండి కొన్ని అక్షరాలు— ఈ విధంగా వేరు వేరు స్థానాలనుంది ఈ అక్షరాల సముదాయం అంతా బయటకు వస్తున్నది. ఇదంతా రావడం దేనివల్ల జరుగుతున్నది? ఈ శబ్దమే హనుమ. వాయువువలన పుట్టినవాడు వాయునందనుడు. శబ్దం వాయువువలన పుడుతుంది. అందుచేత, ఎవరండీ హనుమ? శబ్దస్వరూపుడు అందువల్ల, వేదం చదివేటప్పుడు, దానిని గురువు దగ్గర శిష్యుడు చెప్పుకునేటప్పుడు, " శం నో మిత్రః శం వరుణః శం నో భవత్వర్యమా శం న ఇంద్రో బృహస్పతిః " అని చెప్పిన తరువాత, "నమస్తే వాయో త్వమేవ ప్రత్యక్షం బ్రహ్మాసి, త్వామేవ ప్రత్యక్షం బ్రహ్మ వదిష్యామి, ఋతం వదిష్యామి సత్యం వదిష్యామి తన్మా మవతు తద్వక్తారమవతు, " అని, "చెప్పే గురువును రక్షించాలి, చెప్పుకునే నన్ను రక్షించాలి"— అని వాయువును ప్రార్థిస్తే కానీ, నోట పలకడానికి వీలు లేదు.

కాబట్టి ఈ హనుమ మంత్రస్వరూపుడు. అతడు పుట్టగానే నేరుగా సూర్యుని దగ్గరకు ఎగిరాడు —అని కథ. సూర్యుడు ఎక్కడున్నాడు? నెత్తిపై ఉన్నాడు. ఆ పైకి ఎవరినీ వెళ్ళనివ్వడు, సూర్యుడు. అందుచేత కిందకు నెట్టి వేశాడు. అప్పుడు హనుమ ఏమయినాడు? నోట్లోంచి, దౌడల మధ్య నుంచి బయటకు వచ్చాడు. మీరు ఒకసారి గంభీరంగా మాట్లాడండి. దౌడలు సొట్టపోవూ! దౌడలు సొట్ట పోతే మనం ఏమైనాము?. హనుమాన్ అంటే, దౌడ కదిలినవాడు. అందుచేత, హనుమాన్ అయ్యాడు. ఈ విధంగా హనుమ అనే శబ్దం నాభి దగ్గర పుట్టి, బయలుదేరి పైకి ఎగసి, కిందకు వచ్చి, దౌడల మధ్య నుంచి బయటకు వస్తే, ఈ నాలుక ఆ యా భాగాలకు తగలడం చేత, వాయువును అదిమిపెట్టి మెల్లగా గట్టిగా వదలడంచేత అక్షరాలు బయటికి వస్తున్నాయి. కనుక, అక్షరాలు అభివ్యక్తం అవుతున్నాయి. వర్ణమనేది శబ్దం కాదు. శబ్దం వేరు, నాదం వేరు, వర్ణం వేరు. "ఆ" అని రాస్తే, అదేనా శబ్దం? కాదు. ఇది దాన్ని గుర్తించటానికి ఒక రేఖ మాత్రమే. ఈ రేఖను మనం " అ" అని ఉచ్చరిస్తున్నాము మరి ఏది శబ్దం? నోటినుండి అది ఉచ్చరింపబడుతున్నది. ఆ విధంగా ఉచ్చరింపబడేదానికి ఒక గుర్తు పెట్టారు. కానీ, గుర్తు శబ్దం కాదు. ఉచ్చరించే ధ్వని లోపలనుండి రావడానికి నిత్యంగా ఉండే శబ్దాన్ని అభివ్యక్తం చేశాం. . అంటే, అంతకు ముందే ఉండే శబ్దాన్ని వెలువరించాం. లోపల ఉండే శబ్దాన్ని నోటిలో నుండి బయటపరిచాము. ఎలా బయటపరిచాం?. ఈ లోపల ఉండే స్థానాల ద్వారా బయటపరచాం. అందుచేత వీనికి ఏమని పేరు పెట్టాలి. అంజన. హనుమ తల్లి పేరండి అంజన. . హనుమకు వాయువు తండ్రి, అంజన తల్లి. ఎవరు ఇప్పుడు మన ఆంజనేయ స్వామి? అంజన అంటే వ్యక్తం అయ్యే చోటు. ఈ లోపల ఉండేటటువంటి స్థానాల నుండి, ఏ స్థానం నుండి అక్షరం వచ్చిందో మనకు తెలుస్తుంది. "ప" అంటే పెదవులు ముడవాలి. "ట" అంటే నాలుక చివర వెళ్లి అంగడికి తగలాలి. ఇవన్నీ ఉన్నాయండి. ఆయా స్థానాలనుండి వర్ణాలు అభివ్యక్తం అవుతున్నాయి. అంజన అనేది అభివ్యక్తం చేసే చోటు. అందుచేత అంజనకు, వాయువుకు సంపర్కంచేత పుట్టినవాడు మన హనుమ. ఈ శబ్దం కాదు, మొదట ఋషులనుండి సాక్షాత్కరింపబడిన, అపౌరుషేయంగా భగవంతునియొక్క

నిఃశ్వాసరూపంగా బయటకు వచ్చిన శబ్దం అది. భగవంతుని నిఃశ్వాసమే వేదం. ఆ నిఃశ్వాసం శబ్దరూపమై బయటకు వస్తే వేదమై వచ్చింది అటువంటి వేదమే హనుమ. వేదాన్ని అధికరించినటువంటి మహాపురుషులైన గురువులే హనుమ. హనుమ జ్ఞాననిధి. అంతటి జ్ఞానాన్ని కలిగినవారు ఎవరూ లేరు. శ్రీరాముడు అతనిని పొగిడాడు. . అటువంటి జ్ఞాననిధి, వేద స్వరూపుడు అయిన హనుమ మన శ్రీరామునకు వాహనం. అందుకే భగవంతుని వహించి వచ్చే శబ్దాన్ని ప్రతిపాదించే కాండ సుందరకాండ అయినది.

# శ్రీరామాయణం మన జీవిత కథ

(ఉ. వే. శ్రీమాన్ శ్రీ భాష్యం అప్పలాచార్యస్వామివారి ఉపన్యాసం ఆధారంగా)
సమర్పణం – ఈ, ఏ. సింగరాచార్య దాసుడు

శ్రీరామాయణంలో మనకు మూడు విధాలైన అన్నదమ్ములు కనిపిస్తారు అయోధ్యలో నలుగురు, కిష్కింధలో ఇద్దరు, లంకలో ముగ్గురు. అయోధ్యలో నలుగురు ఎవరంటే– రామలక్ష్మణ భరత శత్రుఘ్నులు. కిష్కిందలో– వాలి సుగ్రీవులు. లంకలో– రావణ కుంభకర్ణ విభీషణులు. శ్రీరామచంద్రుడు ఏమి చేశాడు? అతడు చాలా గొప్పవాడు అని అంటున్నాము. తమ అన్నదమ్ములు నలుగురు చెక్కుచెదరకుండా చివరిదాకా ఉన్నారు. మధ్యలో ఉండే ఇద్దరిలో ఒకరిని వధించాడు, చివరిలో ఉండే ముగ్గురిలో ఇద్దరినీ వధించాడు. అక్కడ ఒకడివి, ఇక్కడ ఒకడిని మాత్రం బతికించాడు. తాము నలుగురు మాత్రం సుఖంగా ఉన్నారు. ఇదేనా రాముని నీతి? అని ఎవరైనా ప్రశ్నించవచ్చు కదా! సమాధానం దీనికి ఏమిటి ?ఆలోచించాలి. ఆలోచిద్దాం.

సరే, బాహ్యంగా, చంపబడినవారు తప్పులు చేశారు కాబట్టి, చంపబడ్డారు– అని పైపైన ఏదో ఒక సమాధానాన్ని మనం చెప్పుకోవచ్చు కానీ, ఇందులో ఉండే అంతరార్థం ఏమిటో గమనించాలి.

అయోధ్యలో ఉండే నలుగురు ఎవరంటే –ధర్మార్థ కామ మోక్షాలే. ఈ నాలుగు పురుషార్థాలు ఎల్లప్పుడూ ఉండాలి. ఇందులో ఏవీ లోపించకూడదు. వీటిలో ఒకటి పోయి, మిగిలినవి ఉంటాయి– అంటే, కుదరదు. జీవితం సరిగా సాగదు. అన్నీ ఉండాలి. మానవులలో ప్రతి ఒక్కడికి ధర్మం ఉండాలి, అర్థం ఉండాలి, కామం ఉండాలి, మోక్షం కూడా ఉండాలి. ఈ నాలుగు ఎల్లప్పుడూ కాపాడుకోదగినవి. అందుచేత, రామ లక్ష్మణ భరత శత్రుఘ్నులు నలుగురు చివరి వరకు నిలిచి ఉన్నారు.

మధ్యలో ఉండే, అంటే, కిష్కింధలో ఉండే ఇద్దరు ఎవరు?అంటే, ప్రవృత్తి మార్గం, నివృత్తి మార్గం. వాలి ప్రవృత్తిమార్గం సుగ్రీవుడు నివృత్తి మార్గం. ప్రవృత్తి మార్గం అంటే —బాహ్యేంద్రియాలకు, మనసుకు వశుడై, బాహ్యమైన విషయాల వైపే ఆకర్షింపబడి, వాటిని అనుభవించాలి అనే భావనను కలిగి ఉండి, వాటినే అనుభవిస్తూ, నేను, నాది —అనే భావనతో వాటి కోసమే లాలసుడై ఉండడం అనేది ప్రవృత్తి మార్గం.

ఇక, నివృత్తి మార్గం అంటే— తాను బాహ్యవిషయాలలో లగ్నం కాకుండా, ఎల్లప్పుడు లోపల ఉండే భగవద్విషయం వైపు మరలి, భగవంతుని ఆరాధిస్తూ, తాను భగవంతునకు చెందినవాడను— అని తెలుసుకొని, భగవంతుని కోసమే ప్రయత్నం చేస్తూ, తాను చేసే అన్ని వ్యాపారాలు వదలకుండా చేస్తూ, వాటిని అన్నిటిని భగవంతుని కొరకు, భగవంతుని ఆజ్ఞ పైన చేస్తూ, అవి కూడా అతడే చేయిస్తున్నాడనే భావనతో చేయడమే నివృత్తి మార్గం. సుగ్రీవుడు అటువంటివాడే కనుక నివృత్తిమార్గనిష్ఠుడు. వాలి ప్రవృత్తి మార్గనిష్ఠుడు. పౌరుషప్రధానుడు. భోగలాలసుడైన ఇంద్రుని కుమారుడు, ఇతడు. ఇతనికి భోగమే ప్రధానం.

సుగ్రీవుడు ఆ విధంగా కాకుండా, తన పౌరుషం చేతకాక, శ్రీరాముని శరణు పొందాడు. కేవలం భగవంతుడైన రాముడే రక్షకుడు— అని విశ్వసించేవాడు కనుక, ఇతని మార్గం నివృత్తిమార్గం. నివృత్తి మార్గాన్ని ఎప్పుడు ఆశ్రయించి ఉండాలి. కర్మను వదలకూడదు. దైవాన్ని వదిలిపెట్టకూడదు. బాహ్యమైన ప్రవృత్తికి, దైవానికి మధ్య ఏ విరోధం లేదు. దైవాన్ని ఆశ్రయించవచ్చు, దైవసంబంధాన్ని నిత్యం భావించవచ్చు. దీనితోపాటు బాహ్యమైన సర్వవ్యాపారాలను నిర్వహించవచ్చును. ఈ రెండిటి కలయికయే సుగ్రీవుడు. అందుచేత ఎవరిని శ్రీరాముడు ఆదరించాలి? సుగ్రీవుని చేరాలి, ఆదరించాలి. అతనిని రక్షించాలి. ప్రవృత్తిమార్గనిష్టుడైన వాలిని శిక్షించాలి. అందువల్ల శ్రీరాముడు సుగ్రీవుని రక్షించి, వాలిని వధించాడు.

ఇక, చివర, లంకలో ఉండే ముగ్గురు అన్నదమ్ములు రాజస రామస సాత్విక మనసులు కలవారు. మనలో ఏ మనస్సు పరిపాలిస్తూ ఉండాలి? రాజసమనస్సు అయిన రావణాసురుడు లంకను పరిపాలిస్తూ ఉన్నాడు. తామస మనసు ఎప్పుడూ రాజసమైన మనసుకు దోహదపడుతూ, సహాయపడుతూ ఉంటుంది. తామస మనస్సు ఎల్లప్పుడూ నిద్రపోతూ ఉంటుంది ఒకవేళ నిద్ర లేచినా, రాజసమైన మనసుకే సహాయపడుతుంది. ఈ మనసే కుంభకర్ణుడు. ఈ విధంగా ఉండే రాజసతామస మనసుల స్వరూపాలైన రావణుడు, కుంభకర్ణుడు తగ్గాలి. సాత్వికమైన మనసుకు ప్రతీక అయిన విభీషణుడు నిలచి ఉండాలి. అదే నిలబడి పరిపాలించాలి. అందుచేత ఎవరిని నిలపాలి? ఎవరిని వధించాలి? సాత్విక మనస్సును కల విభీషణుని నిలపాలి రాజసతామసమనస్సులను గల రావణ కుంభకర్ణులను వధించాలి. విభీషణుని సుప్రతిష్ఠితుని చేయాలి. ఈ రహస్యాలను చెప్పడం కోసమే ఈ విధంగా మూడు విధాలైన అన్నదమ్ములను మహర్షి పెట్టాడు. వీరిలో, ఒకరిని ఆశ్రయించడం, మిగిలిన వారిని చంపడం అనే ఈ కథ అంతా ఏమి? మన జీవిత కథ. జీవితంలో మానవుడు ఏ విధంగా ప్రవర్తించాలో, వేనిని నిలుపుకోవాలో, రక్షించుకోవాలో, దేనిని పెంచుకోవాలో, దేనిని లేకుండా చేసుకోవాలో, తగ్గించుకోవాలో మనకు ఈ అన్నదమ్ముల వృత్తాంతాల ద్వారా శ్రీరామాయణం నేర్పుతున్నది.

# ఎవడు ఉన్నవాడు? ఎవడు లేనివాడు?

మహామహోపాధ్యాయ, ప్రవచన శిరోమణి, ఉ. వే. శ్రీమాన్ శ్రీ భాష్యం అప్పలాచార్యస్వామివారి ఉపన్యాసం ఆధారంగా)
సమర్పణం – ఈ, ఏ. సింగరాచార్య దాసుడు

అది అయోధ్యలో శ్రీరామచంద్రుని సభామంటపం. అక్కడ కుశలవులు శ్రీరామాయణాన్ని మధురంగా గానం చేస్తున్నారు. ఎంతోమంది శ్రోతలు ఆ సభలో కుశలవులు చేసే ఆ శ్రీరామాయణ మధుర గానాన్ని తన్మయులై వింటున్నారు. శ్రీరామచంద్రుడు చక్రవర్తి కనుక పెద్ద సింహాసనం పైన కూర్చున్నాడు. సభ నిండుగా ఉన్నది. అందరూ పరవశంగా వింటున్నారు. శ్రీరాముడు తనకు తెలియకుండానే తన ఆసనం పైనుండి జరిగి కిందకు వచ్చి, అలా అలా మెల్లిమెల్లిగా కుశలవుల దగ్గర చేరి కూర్చున్నాడు. సభలో ఎవరికీ అంతరాయం కలగకుండా మెల్లిగా వచ్చి కుశలవుల దగ్గర కూర్చున్నాడు.

ఈ సందర్భంలో వాల్మీకి ఈ విధంగా అంటున్నాడు. "పరిషద్గతః శనైః బుభూషయా ఆసక్తిమనా బభూవ హ" అని. శ్రీరాముడు తన కథనే తాను వింటున్నాడు పరవశంగా వింటున్నాడు. చిత్రం! లోకంలో ఎవరైనా మన గురించి చెబుతూ ఉంటే, మనం అందరం సిగ్గుతో తలవంచుకొని కూర్చుంటాము కదా. ఈ శ్రీరామచంద్రుడు ఏమిటి? ఈ విధంగా చేస్తున్నాడు? తన చరిత్రను శ్రద్ధగా వింటూ, సభలోపలకి వచ్చేశాడే! ఏమిటి! అని మనం భావించవచ్చు కదా! దానికి వాల్మీకి మహర్షి ఈ విధంగా సమాధానం చెబుతున్నాడు,

ఈ శ్లోకంలో. ఇక్కడ "బుభూషయా "అని మహర్షి అన్నాడు. సంస్కృత భాషలో "భూభూషయా" అంటే– ఉండాలనే కోరికతో –అని అర్థం. పిపాసా అంటే– తాగాలనే

కోరిక. జిజ్ఞాసా అంటే –తెలుసుకోవాలి అనే కోరిక. ఆ విధంగానే, బుభూషా–అంటే ఉండాలనే కోరిక.

మనం అందరం ఉండాలి అనుకుంటే, ముందుగా అసలు మనం ఉన్నామా? లేమా? అనే విషయాన్ని గమనించాలి. లేకేమీ, మనం ఉన్నాం కదా! అని మనం అనుకుంటున్నాం. కానీ, మనం ఉన్నామా, లేదా, అనే విషయాన్ని ఉపనిషత్తు చెబుతున్నది. ఎవడు ఉన్నవాడు? ఎవడు లేనివాడు? ఎవడు, తాను ఎవడో, ఎటువంటివాడో, తనకు తెలిసి, తాను ఎవరికి చెందినవాడో తెలిసి ఉన్నవాడైతే, వాడు ఉన్నట్లు లెక్క. " ఆస్తి బ్రహ్మేతి చేద్వేద సంత మేనం తతో విదుః. " అని ఉపనిషత్ చెబుతున్నది.

"అస్తి బ్రహ్మ" – ఈ విశాలమైన విశ్వమంతా వ్యాపించి ఉండే ఒక తత్వం ఉన్నది. విశాలమైన ఈ విశ్వాన్ని అంతటినీ నియమించే ఒక తత్వం ఉన్నది. ఆ తత్వం అందరిలోనూ ఉన్నది. ఆ తత్వం నాలోనూ ఉన్నది. ఈ భావం నీలో ఉన్నట్లయితే, అప్పుడు నీవు ఉన్నట్లు లెక్క. అది లేకపోతే నీవు లేనట్లే లెక్క– అని ఉపనిషత్తు చెప్పింది, కనుక, రామాయణం వింటే విన్నవాడు. ఉన్నవాడు అవుతాడట. తాను మారుతాడట. సంస్కృతంలో "భూ" అనే ధాతువునకు "ఉండుట, అగుట" అనే రెండు అర్థాలు ఉన్నాయి. " అస్తి" అంటే– ఉన్నాడు, అవుతున్నాడు– అని అర్థం. మనమంతా ఉన్నాము. ఆ విధంగానే అవుతున్నాము ఏమి కావాలి మనం ఎందులో ఉన్నాము దానికి తగిన స్థితిని పొందాలి. " మనమందరం ఉండాలి, ఆ స్థితి కలగాలి" అంటే, మనం రామాయణం వినాలి– అని వాల్మీకి మహర్షి తెలియజేస్తున్నారు. రామచంద్ర ప్రభువు, తాను ఉండాలనే కోరికతో శ్రీరామాయణం విన్నాడని మహర్షి చెప్పాడు కనుక, మనం కూడా శ్రీరామాయణాన్ని విని, అస్తిత్వాన్ని పొందుదాం. కావలసిన రీతిలో అవుదాం.

## సంక్షేప రామాయణం –గాయత్రీ మంత్రరూపం

శ్రీరామాయణం గాయత్రీమంత్రార్థ ప్రతిపాదకమని, ఆ కావ్యంల్లో గాయత్రీమంత్రంలోని అక్షరాలు ఆయా శ్లోకాలలో నిక్షిప్తం చేయబడడంతో పాటు, గాయత్రీ మంత్ర ప్రతిపాదితమైన అర్థం కూడా ఆ కావ్యంలో భాసిస్తున్నదనేది ప్రసిద్ధమైన విషయం.

వాల్మీకిముని శ్రీరామాయణాన్ని రచించడానికి మూలం అతనికి నారద మహర్షి ఉపదేశించిన సంక్షేపరామాయణమనేది కూడా ప్రసిద్ధమైన విషయం. అయితే, ఈ సంక్షేపరామాయణం కూడా గాయత్రీమంత్రసంక్షేపరూపమే. దీనిని ప్రత్యాహారన్యాయంలో పెద్దలు నిరూపించారు. ప్రత్యాహార న్యాయం అంటే ఈ నాడు మనం ఆంగ్లభాషలో చెప్పుకునే అబ్రివేషన్ వంటిది.

గాయత్రీమంత్రం "తత్సవితుః" అని "త"కారంతో ప్రారంభమై, "ప్రచోదయాత్ "అని "యాత్" అనే అక్షరాలలతో పూర్తి అవుతున్నది. సంక్షేపరామాయణంకూడా ఈ విధంగానే ప్రారంభమై, పూర్తి కావడం విశేషం.

సంక్షేపరామాయణంలోని మొదటి శ్లోకం "తపః స్వాధ్యాయ నిరతమ్" అని తకారంతో ప్రారంభమవుతున్నది. ఆ విధంగానే, చివరి శ్లోకంలోని చివరి పాదం " మహత్వమీయాత్" అని "యాత్" అనే అక్షరాలలతో పూర్తి అవుతున్నది.

సంక్షేప రామాయణానికి వివరణమే మిగిలిన రామాయణం అంతా. సంక్షేపరామాయణంలో గాయత్రీమంత్రం ప్రత్యాహారన్యాయంతో నారద మహర్షిచేత సంగ్రహంగా నిక్షిప్తం చేయబడి వివరింపబడినట్లు, ఆ మంత్రం, వాల్మీకి మహర్షి చేత అదే న్యాయంలోహ శ్రీరామాయణంలో నిక్షిప్తం చేయబడి, వివరింపబడింది.

# శ్రీరామాయణంలో ఉపనిషత్కథ

(మహామహోపాధ్యాయ, ప్రవచన శిరోమణి, ఉ. వే. శ్రీమాన్ శ్రీ భాష్యం అప్పలాచార్యస్వామివారి ఉపన్యాసం ఆధారంగా)
సమర్పణం – ఈ, ఏ. సింగరాచార్య దాసుడు

సీతమ్మ ఈ లోకంలోకి ఎందుకు వచ్చింది? అంటే, రెండు పనుల కోసం వచ్చింది. ఒకటి– స్త్రీ ధర్మాన్ని నేర్పడం కోసం వచ్చింది, రెండవది –ఆత్మ స్వరూపాన్ని తెలియజేయడం కోసం వచ్చింది.

ఆత్మ అంటే ఏమి? ఎక్కడ ఉంటుంది? భగవద్గీతలో శ్రీకృష్ణ భగవానుడు చెప్పాడు కదా! ఆత్మ క్షేత్రంలో ఉంటుంది అని. "ఇదం శరీరం కౌంతేయ! క్షేత్రమిత్యభిధీయతే." ఈ శరీరానికి క్షేత్రం అని పేరు. ఈ క్షేత్రంలో ఏమున్నది? ఆత్మ ఉన్నది. క్షేత్రాన్ని దున్నితే సీతమ్మ దొరికింది. ఈ విషయం మనకందరకు తెలుసు. జనకుడు ఏ క్షేత్రాన్ని దున్నాడు? యజ్ఞం భూమిని దున్నాడు. మనం ఇక్కడ ఏ క్షేత్రాన్ని దున్నాలి? అంటే, కర్మ క్షేత్రాన్ని దున్నాలి. ఏది కర్మ క్షేత్రం? కర్మ చేయడం కోసం ఏర్పడిన శరీరమే క్షేత్రం. దీనిని దున్నడం అంటే ఏమిటి ?ఆనాడు జనకుడు యజ్ఞభూమిని నాగలితో దున్నాడు. ఇక్కడ ఈ కర్మభూమిని ప్రజ్ఞ అనే నాగలితో దున్నాలి. ప్రజ్ఞ అంటే జ్ఞానం. సదాచార్యుల చేత ఉపదేశింపబడిన తత్వజ్ఞానం. ఆ జ్ఞానంతో ఈ కర్మక్షేత్రాన్ని దున్నాలి. నాగలితో ఏ విధంగా భూమి లోపలికి దున్నుతామో, ఆ విధంగానే, జ్ఞానం అనే నాగలితో కర్మ క్షేత్రాన్ని దున్నాలి. అపుడు, క్షేత్రంలో మరుగుపడి ఉన్నటువంటి సీత బయటపడినట్టుగా, ఈ కర్మ క్షేత్రంలో మరుగుపడి ఉండే ఆత్మ బయటపడుతుంది, అంటే, ప్రకాశిస్తుంది.

ఆనాడు సీతమ్మను జనకుడు ఎవరికి ఇచ్చి పెళ్లి చేశాడు? పరమాత్మ అయిన శ్రీరామునకు ఇచ్చి పెళ్లి చేశాడు. శ్రీరాముడు ఏమి చేస్తే ఇచ్చి పెళ్లి చేశాడు? విల్లును

వంచితే సీతను ఇచ్చి పెళ్లి చేశాడు. అందుచేత ఇక్కడ కూడా ఆత్మ అనే సీతను విల్లును వంచిన వానికి ఇచ్చి పెళ్లి చెయ్యాలి. ఎవరి వైపు విల్లు వంగుతుందో, అతనికి ఇచ్చి పెళ్లి చెయ్యాలి

"విల్లు ఎవరికి వంగితే వారికి ఇచ్చి పెళ్లి చేస్తాను" అని జనకుడు ఒక పణాన్ని పెట్టాడు. జనక మహారాజు బెంగ పెట్టుకున్నాడు. సీత పెరిగి పెద్దదవుతున్నది. పెళ్లి ఈడు కూడా వచ్చింది. పెళ్లి చేసుకోవడానికి తగినవారు ఎవరూ రావడం లేదు. ఎందరో పెద్దవాళ్లు వచ్చారు. అందరూ పడిపోతున్నారు. బెంగపడి పోతున్నాడు, జనకుడు. ఇప్పుడేమి చేయాలి? అని అతడు గాబరా పడుతూ ఉండగా, అపుడొక పసివాడు వచ్చాడు, 12 ఏళ్ల కుర్రవాడు. విల్లును ఎక్కుపెట్టాడు, అది వంగిపోయింది, విరిగిపోయింది. సీతమ్మను ఆ కుర్రవానికి ఇచ్చి జనకుడు వివాహం చేశాడు.

అయితే, ఇప్పుడు ఈ ఆత్మను ఎవరికి ఇచ్చి పెళ్లి చేయాలి? ఇక్కడే ఉన్నది రహస్యం. ఈ రహస్యం ఉపనిషత్తులలోని రహస్యం. శ్రీరామాయణం వేదమనడానికి కారణం ఇదే. వేదంలో ప్రతిపాదింపబడిన రహస్యార్థాలను శ్రీరామాయణంలో వివరించడం కోసం మహర్షి ఇందులో ఒక ఉపనిషత్కథను పెట్టాడు. కథ లోపల ఉంటుంది. బయట కథ అందంగా కోకిల గానంవలె నడుస్తుంది. ఆ కథలోపల చూస్తే సింహగర్జనంలాంటి వేదగర్జన వినిపిస్తుంది. ముండకోపనిషత్తులో విల్లు అని ప్రణవానికి పేరు పెట్టడం జరిగింది. " ప్రణవో ధనుః శరో హ్యాత్మా" అని అంటుంది, ఆ ఉపనిషత్తు. ప్రణవం అంటే —ఓం అనే అక్షరం. ఈ అక్షరానికి విల్లు అని పేరు. " ఓమిత్యాత్మానం యుంజీత", " ఓమిత్యాత్మానం ధ్యాయథ" అని అంటుంది, ఉపనిషత్తు. ఓమ్ అని ఆత్మను ధ్యానం చేయండి, ఓమ్ అని ఆత్మను పరమాత్మతో చేర్చండి— అని వేదం చెప్పింది. అందుచేత, ఈ ఆత్మను పరమాత్మతో చేర్చడానికి ఏమి కావాలి? ఓమ్ అనబడే ప్రణవం కావాలి. ప్రణవం అనేది సాధనంగా కావాలి. ఈ ప్రణవమే విల్లు. ఇది ఎవరికి వంగితే వారికి, ఇచ్చి పెళ్లి చేయాలి అనేది నియమం ఇక్కడ వంగడం అంటే ఏమి? మన పేరుకు

సంస్కృతంలో నామ అని పేరు. నామ అంటే ఏమి? "నమతి ఇతి నామ" –ఎవరికి ఒంగుతుందో, అంటే, ఎవరి వైపు వంగి అతనిని నిర్దేశిస్తుందో, దానికి నామ అని పేరు. ఇక్కడనుండి "రామా! " అని పిలిస్తే, ఆ నామం అందరినీ వదిలిపెట్టి, ఆ పేరును కలవాని వైపు వంగుతుంది. ఒక నామం ఎవడికీ పేరైతే, వాడి వైపు ఆ నామం వంగుతుంది. కనుక, మన ఆత్మను అన్ని పేర్లచేత చెప్పబడే భగవంతునకు ఇచ్చి పెళ్లి చేయాలి. ప్రణవరూపమైన ధనస్సు ఎవరికి వంగింది? రామునకు వంగింది. అందుచేత, రామునకు ఇచ్చి పెళ్లి చెయ్యాలి. . ఎవరిని ఇచ్చి పెళ్లి చేయాలి? సీతమ్మను ఇచ్చి పెళ్లి చేయాలి. సీతమ్మ ఎవరు? భూజాత, భూమినుండి పుట్టినది. భూమి ఏమి? క్షేత్రం. ఈ క్షేత్రం ఏ క్షేత్రం? కర్మ క్షేత్రం, అది శరీరమే. శరీరంలో అనాదిగా మరుగుపడి ఉండి, ఒకనాడు బయటపడిన ఈ ఆత్మను ఈ ప్రణవం ఎవరికి వంగితే, అంటే, వాచకం అయితే, శబ్దమైతే, అటువంటివానికి ఇచ్చి పెళ్లి చేయాలి. ఇది ఉపనిషత్కథ. ఈ ఉపనిషత్కథను వాల్మీకిమహర్షి చాలా అందంగా సీతారామకళ్యాణ గాథలో పొందుపరిచాడు. అందుచేత వేదమే శ్రీరామాయణంగా అవతరించినది.




ఉలగళంద పెరుమాళ్, కాంచీపురం

# నూరు అంటే ఏమి?

(మహామహోపాధ్యాయ, ప్రవచన శిరోమణి, ఉ. వే. శ్రీమాన్ శ్రీ భాష్యం అప్పలాచార్యస్వామివారి ఉపన్యాసం ఆధారంగా)
సమర్పణం – ఈ, ఏ. సింగరాచార్య దాసుడు

హనుమ నూరు యోజనాల నిడివి కలిగిన సముద్రాన్ని దాటి, లంకలో ఉండే సీతమ్మను చూశాడు. మనం కూడా ఒక సముద్రాన్ని దాటితే, ఆత్మ అనే సీతమ్మను చూడవచ్చు. మనకు కూడా దాటవలసిన ఒక సముద్రం ఉన్నది ఆ సముద్రం సంసార సముద్రం. సంసారం అంటే ఏమి?, సం +సారం= సంసారం. సమ్ అంటే– బాగా, సారం– కలిపి నడిపించేది– అని అర్థం. దేనితో కలిపి? మన ఆత్మ, శరీరం –అనే ఈ రెండిటిని బాగా కలిపి, ఏకం చేసి నడిపించేది –అని అర్థం. °సమిత్యేకీకారే° అని సంస్కృతంలో చెప్పబడుతుంది. సం– అంటే ఒకటి అవడం. ఏ రెండు ఒకటి అవుతాయి? శరీరం, ఆత్మ అనే రెండు కలిసి సంసారంలో ఒకటి అవుతాయి. శరీరం, ఆత్మ అనే ఈ రెండు ఒకటే అనే భావం మనకు ఉన్నంతకాలం, మనం సంసారంలో ఉన్నట్టే లెక్క. ఈ సంసారం వద్దండి! అంటే, పిల్లలు వద్దు –అని కొందరి అభిప్రాయం సంసారం వద్దు అంటే– ఇల్లు మొదలైనవి వద్దని కొందరి అభిప్రాయం. అది కాదు అర్థం. అడవిలో ఉన్నా, సంసారంలో ఉన్నట్టే అర్థం– శరీరం ఆత్మ అనే రెండు ఒకటే అనే అభిప్రాయం కనుక ఉన్నట్లయితే. మీలో ఎంతవరకు " శరీరమే ఆత్మ", అనే భావం తగ్గదో, శరీరమే నేను అనే భావం తగ్గదో, అంతవరకు మనం ఎక్కడ ఉన్నా, సంసారంలో ఉన్నట్టే లెక్క. అందుచేత, సంసారం అనేది ఎక్కడో లేదు, మనలోనే ఉన్నది.

ఈ సంసారాన్ని మనం దాటాలి. ఇది ఎంత నిడివి ఉన్నదండి? అంటే, నూరు యోజనాల నిడివి ఉన్నది. హనుమ దాటిన సముద్ర నూరు యోజనాల నిడివి కలిగినది అని అన్నారు, మహర్షి. తప్పండి! అది ఇప్పుడు అంత లేదు. ఇప్పటి లెక్కలను బట్టి నూరు యోజనాలు ఎక్కడ ఉన్నది? అని కొందరు ఆక్షేపించవచ్చు. యోజన మంటే

రెండు క్రోసుల దూరం. రెండు క్రోసులంటే నాలుగు మైళ్ళు. నూరు యోజనాలంటే అది ఎంత దూరం ఉండాలి? అది ఇప్పుడు అంత లేదు కదా ఇప్పుడు ఉండే శ్రీలంకకు, మన దేశానికి మధ్య అంత దూరం లేదే! అని ఇప్పటి భూగోళాన్ని మాత్రం తెలిసినవారు సందేహించవచ్చు, అయితే, అప్పటి భౌగోళిక స్వరూపాన్ని బట్టి ఇప్పుడు ఉన్నంత దూరంగా ఉంటే ఎక్కువ దూరమే ఉండి ఉండవచ్చు, ఎందుకంటే, ఈ వృత్తాంతం కొన్ని యుగాల వెనుకాల జరిగినది కనుక.

కానీ, అది కాదు విషయం, ఇక్కడ ధ్వన్యర్థం గ్రహించవలసినది ఒకటి ఉన్నది. నూరు అనే సంఖ్య తత్త్వ వివేచనం చేసే సంఖ్య. తత్వాలు మూడు. మనకు బయటకు గోచరించేది అంతా ప్రకృతి. ఇది దృశ్యం, కనబడుతుంది, దీనికి వెనకాల ఉండేది ఆత్మ. అది అదృశ్యం. కనపడదు. అది నిత్యం. అణువు. అది శరీరం లోపల వ్యాపించి ఉంటుంది కర్మవశంచేత సంకుచితమైన జ్ఞానాన్ని కలిగి ఉంటుంది. దానికంటే వెనుకాల ఒక తత్వం ఉన్నది. అది పరమాత్మ తత్వం. అది విశ్వమంతా వ్యాపించి ఉంటుంది. ఎప్పుడూ దాని జ్ఞానానికి సంకోచం ఉండదు. ఎప్పుడూ దానికి కర్మబంధనం లేదు. స్వరాట్టుగా ఉంటుంది. అటువంటి ఒక తత్వం ఉన్నది. ఆ తత్వం పరమాత్మ తత్వం. దానికి ఈ రెండు తత్వాలు అనుబంధ తత్వాలు. ఇవి రెండూ ప్రధాన తత్వంతో చేరి ఉంటాయి. ఎల్లప్పుడూ చేరి ఉంటాయి. చేరి ఉంటేనే అవి ఉండ గలవు. లేకపోతే ఉండలేవు. అందుచేత, ప్రకృతి, జీవతత్వం అనే రెండు తత్వాలు పరమాత్మ తత్వం పైన ఆధారపడి ఉన్నాయి. అందుచేత, ఇవి మనకి ఉన్నవా? లేవా? అంటే, 99 అనే సంఖ్యకు ఒకటి కలుపగానే, అది నూరు అవుతుంది. నూరు అనే సంఖ్యను రాసేటప్పుడు, ముందుగా ఒకటి అనే సంఖ్యను రాసి, తరువాత రెండు సున్నాలను రాస్తాము. ఒకటి తరువాత రాసిన ఈ రెండు సున్నాలకు ఏదైనా విలువ ఉన్నదా? లేదా? విలువ ఉన్నది. ఇందులో ఒక తొమ్మిది, అందులో ఒక తొమ్మిది ఉన్నది. వాటికి ఒకటి కలుపగానే, అవి రెండు పూర్ణాలు అవుతాయి. ఆ రెండు శూన్యాలు కావు. విలువ కలిగినవి అవుతాయి. ఇక్కడ ఏమున్నాయి? ఇక్కడ ప్రకృతి ఉన్నది, ఆత్మ కూడా

ఉన్నది. దీనికి వెనకాల పరమాత్మ తత్వం ఉన్నది. ఒకటి ఉంటేనే, రెండు సున్నలు పూర్ణంగా ఉన్నవి. ఆ ఒకటి లేకపోతే అవి రెండూ లేవు. ఒకటి లేకపోతే తాము లేనివి. ఒకటిని విడచి ప్రత్యేకమైన అస్తిత్వాన్ని కలిగి ఉండనివి అయినటువంటి రెండు తత్వాలు ఉన్నాయి. అవి జీవజడతత్వాలు. ఈ రెండు తత్వాలు ప్రధానమైన ఒక తత్వం పై ఆధారపడి ఉన్నాయి– అనే విషయం మనకు తెలిస్తే, మనం సంసార సముద్రాన్ని దాటినట్టు లెక్క. అందుచేత లోపల ఒక పూర్ణమైన, నిత్యమైన, పరమాత్మ తత్వం ఉన్నది. "ప్రకృతిం పురుషం చైవ విద్ధ్యనాదీ ఉభావపి" అని గీత చెబుతుంది. ప్రకృతి, పురుషుడు అనే రెండు తత్వాలు ఎప్పుడూ ఉన్నవే, కానీ, ఈ రెండు తత్వాలలో, ప్రకృతి ఎప్పుడు రూపంలో మారిపోతూ ఉంటుంది. జీవుడు కర్మవశంచేత స్వభావంలో మార్పును పొందుతూ ఉంటాడు. అయితే, ఆ కర్మ తీరిపోతే, మళ్లీ జ్ఞానం వికసిస్తుంది. మళ్లీ అతడు పరిపూర్ణంగా భగవంతునితో సామ్యాన్ని పొందగలడు. ఈ జడమైన ప్రకృతి మాత్రం నామరూపాలు లేకుండా సమసిపోతుంది. అందుచేత ప్రకృతి ఉన్నది, ఆత్మ ఉన్నది, పరమాత్మ తత్వం ఉన్నది. స్వరూపంలో మార్పు చెందేది ప్రకృతి. స్వభావంలో మార్పు చెందేవాడు ఆత్మ. ఈ రెండు విధాలైన మార్పులను లేనివాడు పరమాత్మ. ఏకరూపమైన జ్ఞానంతో, ఒకే రూపంగా ఉండేవాడు భగవంతుడు. ఈ విధంగా మూడు తత్వాల యొక్క రహస్యాన్ని తెలిసినట్లయితే నూరు యోజనాల సముద్రాన్ని దాటినట్లే లెక్క. సముద్రం దాటడం అంటే, బయట ఒక సముద్రం ఉన్నది. దానిని హనుమ దాటాడు. అతనికి సీత కనిపించింది. . ఆ విధంగానే, ప్రకృతి జీవ పరమాత్మతత్వాల స్వరూపాన్ని ఆచార్య సన్నిధిలో తెలుసుకుంటే, "ఈ శరీరమే నేనే "అనే భ్రాంతి నీకు తొలగిపోతే, ఈ శరీరం అనే లంకలో ఉండే సీతమ్మ అనే ఆత్మ ప్రత్యక్షమవుతుంది. చూడవచ్చు. వెళ్లి చూడు. అదిగో! నాకు కనిపిస్తూ ఉన్నది " అని అన్నాడు, గురుస్థానీయుడైన. మహనీయుడైన సంపాతి. ఇదే నూరు యోజనాల తత్వం.

# శ్రీవిశిష్టాద్వైత (రామానుజ దర్శన) సంగ్రహం

ఈ వ్యాసాన్ని రామతీర్థం క్షేత్ర వాస్తవ్యులు, సుప్రసిద్ధ విద్వాంసులు ఉ. వే. శ్రీమాన్ తిరుమల పల్లేర్లమూడి రామానుజ స్వామివారు అనే మహనీయులు రచించారు. ఇది 19 56 వ సంవత్సరంలో పెంటపాడు శ్రీవైష్ణవ పత్రిక ముద్రాలయంలో ప్రకటింపబడింది. శ్రీరామానుజస్వామివారు ఉభయ వేదాంతాలలోనే కాక, ఆయుర్వేదంలో కూడా తలస్పర్శి అయిన పాండిత్యాన్ని కలవారు. ఇంతకుమించి, సంస్కృతంలో, తెలుగులో, ద్రావిడ భాషలో మధురమైన కవిత్వాన్ని చెప్పగలిగినవారు. ద్రావిడ దేశానికి ఏమాత్రం ఏమాత్రం సమీపంలో లేని విజయనగర ప్రాంతంలో నివసించిన ఈ స్వామివారు, ద్రావిడ దేశంలో పుట్టి, ద్రావిడ భాషను నేర్చిన పండితులు రచించే విధంగా తీయని ద్రావిడపాశురాలను రచించగలగడం ఒక అద్భుతమైన విషయం. రామతీర్థం, సింహాచలం, భద్రాచలం, జగన్నాథం, పద్మనాభం క్షేత్రాలలోని అర్చామూర్తులను ఉద్దేశించి వీరు రచించిన ద్రావిడ పాశురాలను చూస్తే ఎవరికైనా ఆశ్చర్యం కలుగక మానదు. వీరు, ఎంబేరయ్య గుళ్ళు అనే క్షేత్రంలో వెలసిన శ్రీరామానుజుల అర్చామూర్తి విషయంగా సంస్కృత భాషలో రచించిన శ్లోకరూపమైన మన్నాథ శతకకావ్యం చాలా మధురం.

వీరు రచించిన మొట్టమొదటి గ్రంథమే ఈ వ్యాసం. ఇందులో విశిష్టాద్వైత సిద్ధాంత తత్త్వాలు చాలా సంగ్రహంగా అయినా, స్పష్టంగా వివరించబడ్డాయి. ఈ వ్యాసం ఇప్పుడు మళ్లీ ఆస్తిక పాఠకుల కోసం సమర్పింపబడుతున్నది. అప్పుడు ప్రచురింపబడిన వ్యాసం గాంధిక భాషలో ఉన్నందున, అది ఇపుడు వ్యావహారిక భాషలో మార్పు చేయబడింది.

**శ్రీవిశిష్టాద్వైత (రామానుజ దర్శన) సంగ్రహం**

సర్వదేశదశాకాలేష్వవ్యాహతపరాక్రమా,
రామానుజార్యదివ్యాజ్ఞా వర్ధతా మభివర్ధతామ్.

## విశిష్టాద్వైతమ్

వైదికులయిన శ్రీవైష్ణవులు ఆదరించిన మతం విశిష్టాద్వైతం. దీనినే రామానుజ దర్శనం అని కూడా శాస్త్ర కారులు వ్యవహరించారు. విశిష్టాద్వైతం అంటే —చిత్తు, అచిత్తు (జీవ ప్రకృతులు) అనే వీటిని ఏ సమయములోనూ వీడి ఉండని, కార్య కారణ రూప బ్రహ్మ పదార్థానికి అభేదాన్ని చెప్పే మతం— అని ఒక అర్థం. చిత్తు, అచిత్తులను ఏనాటికి విడువని బ్రహ్మం ఒక్కటే, అటువంటిది ఇంకొకటి లేదు —అని చెప్పే మతం— అని ఇంకొక అర్థం. దీనివల్ల మనం తెలుసుకోవలసినది ఏమి అంటే —ఈ ప్రపంచం, దానికి కారణమైనది కూడా ఒక్క బ్రహ్మ పదార్థమే. అది ఎల్లప్పుడూ (సూక్ష్మ స్థూల అవస్థలను పొందే) ప్రకృతిలోను, జీవసమిష్టిలోను కలసి ఉంటుంది. అటువంటి బ్రహ్మ పదార్థం ఒకటే. అనేకంగా లేవు —అని ఈ మతం బోధిస్తుంది— అని గ్రహించాలి.

## ఈ మతం ప్రాచీనత

ఈ మతాన్ని క్రీస్తు శకం సుమారు పదవ శతాబ్దంలో అవతరించిన భగవద్రామానుజులు విస్తరింప చేశారు. అంతకు పూర్వం ఈ మతం భాగవతమతమని, బోధాయన శఠకోపటంక ద్రమిడ గుహ దేవాది పూర్వాచార్యులచే వ్యవహరింపబడింది. అందువల్ల ఈ మతం ఋషి ప్రవరుల చేత, గొప్ప దార్శనికుల చేత, భక్త ప్రవరుల చేత ఆదరింపబడిన ప్రాచీన మతమై ఉన్నది.

ఈ మతాన్ని, ఇతర మతంలోని అనుపత్తులను చూపిస్తూ, వాటిని నిరసించి, చాలా విశదంగా శ్రీ రామానుజులు స్థాపించడం చేత, శ్రీరంగనాథుడు దీనికి రామానుజ దర్శనమ్ (ఎంబెరుమానార్ దర్శనమ్) అని లోకంలో పేరును వ్యాపింప చేశాడు— అని ప్రామాణికులు అంటారు.

## ఈ మతంయొక్క వైదికత్వం

ఈ రామానుజ దర్శనంలో ప్రమాణాలుగా స్వీకరింపబడినవి మూడు, అవి, ప్రత్యక్ష అనుమాన శబ్దాలు. అందులో, శబ్దం అనేది– నిత్యమై, అపౌరుషేయమై, స్వయం ప్రమాణమై ఉండే వేదమే. ఆ వేదం చేత చెప్పబడిన అన్ని విషయాలను ప్రత్యక్ష అనుమానాలతో విరోధం లేకుండా ఈ మతం సమన్వయపరచింది. ఇటువంటి సమన్వయం ఇక ఏ ఇతర మతాలలోనూ చేయబడలేదు. అందుచేత ఈ మతం, వేదాన్ని ప్రమాణంగా అంగీకరించినది కావడం చేత, వైదిక మతమే అవుతున్నది.

## అవైదికమతత్వారోపణం, దాని నిరాసం

ప్రస్తుతం ఈ వైష్ణవ మతం అవైధికులలో వ్యాపించి ఉండే రీతిని బట్టి, ఇది శాక్తేయం మొదలైన వామాచార సంప్రదాయాచరణలతో కూడి ఉన్నదని కొందరు భావించి, ఇది తాంత్రిక మతమే కానీ, వైదికం కాదు –అని అంటున్నారు. ఎందుకంటే, వేదంలో సాక్షాత్తుగా "న సురాం పిబేత్, న కలంజం భక్షయేత్, న పరదారాన్ గచ్ఛేత్, న హింస్యాత్ సర్వా భూతాని" అని ఈ విధంగా ఉండే నిషేధ వాక్యాలచేత నిషేధింపబడిన సురాపానం, మాంసభక్షణం, పరదారాగమనం కూడా మతధర్మాలుగా ఆచరింపబడడం (వామాచారం) ప్రసిద్ధంగా ఉన్నది. అందుచేత, ఇది వైదికం అనడానికి సాధ్యం కాదు. అంతేకాక, ఈ సిద్ధాంతంలోనివారు వైదికాలైన వర్ణాశ్రమ కర్మలను విడువడంచేత కూడా ఇది అవైదికం –అనే ఆరోపణ ఈ మతం పైన వస్తున్నది. దీనికి సమాధానాన్ని ప్రామాణికులు ఈ విధంగా తెలియజేస్తున్నారు.

శ్రీ రామానుజుల కాలంలో వారి ఔదార్యాన్ని బట్టి అనేకులు వైదికులు, అవైదికులు ఈ మతాన్ని సారవత్తమంగా గ్రహించి, వారిని ఆశ్రయించారు. శ్రీ రామానుజులవారు కూడా తమ ఉదార స్వభావం చేత వారికి వైష్ణవ సిద్ధాంతాన్ని బోధించి, వారిని అందరిని వైష్ణవులుగా చేశారు.

వారిలో, " కూచి, మారి "అని ఇద్దరు స్త్రీలు చాలా పాండిత్యాన్ని కలిగినవారు. వారు ఈ సిద్ధాంతంలో చేరారు. వారు శ్రీ రామానుజుల పాండిత్యానికే కాకుండా, వారి శరీర శోభను కూడా చూసి, దానికి ఆకర్షితులై, వారిని తుచ్ఛ సుఖం కోసం అర్థించారు. కానీ, జితేంద్రియులు, చతుర్థాశ్రమనిష్ఠులైన రామానుజులు వారి కోరికను అంగీకరించక నిరాకరించారు. స్త్రీ స్వభావం వల్ల నిరాకరింపబడిన వారి ప్రేమ ఈర్ష్యగా పరిణమించినందున, వారు శ్రీరామానుజ సిద్ధాంతాన్ని అపసిద్ధాంతంగా చేసి, హేయంగా చేయాలని ప్రయత్నించి, వేరొక చోట్లకు వెళ్లి, తమ పాండిత్యంతో ప్రజలను ఆకర్షించి, వారికి శ్రీరామానుజ సిద్ధాంతాన్ని చెప్పి, వామాచార ప్రయుక్తాలైన సురాపానం, మాంసాహారం, వ్యభిచారం మొదలైన వామాచారమతసాంప్రదాయాలను బోధించడం ఆరంభించారు. క్రమంగా నీరు పల్లానికి పోయే రీతిగా, చాలామంది జనుల మనస్సులు ఆ నిమ్న మార్గంలోకి ఆకర్షింపబడ్డాయి. అటువంటి వారు సామాన్యంగా నిమ్న జాతులవారే అధికంగా ఉండడం చేత, వర్ణాశ్రమాధి ధర్మాలను వారు పాటించకుండా ఉన్నారు. క్రమంగా వైదికులుకూడా ఈ నిమ్నాలైన ఆచారాలను అలవాటు చేసుకున్నారు. అపుడు "ఇదేనా రామానుజ సిద్ధాంతం! " అని కొందరు అద్వైతులు ఈ సంప్రదాయాన్ని నిందించడం ప్రారంభించారు. అందుచే, ఈ సిద్ధాంతానికి ఇటువంటి ఆరోపణ వచ్చిందే తప్ప, వాస్తవంగా ఈ మతం అటువంటి అవైదికమైన, వర్ణాశ్రమ ధర్మ రహితమైన వామాచార మతం కాదు –అని ప్రామాణికులు అంటారు.

**ఉపనిషత్తులు**

శ్రీ రామానుజులు పరిగ్రహించిన ఈ విశిష్టాద్వైత మతం ఇంతకు ముందు వివరించిన దోషాలతో కూడినది కాదు –అని వారు నిర్వహించిన శ్రీభాష్య గ్రంథం వల్ల స్పష్టమవుతుంది. అందులో శ్రీవేదవ్యాస మహర్షి చేత అనుగ్రహింపబడిన బ్రహ్మసూత్రాలను వ్యాఖ్యానం చేస్తూ ఆయా సూత్ర విషయ వాక్యాలను చక్కగా అనుసరించి, విశిష్టాద్వైత మతానికి అనుగుణంగా వివరించడం వల్ల ఈ మతం వేద ప్రమాణానుబంధమని తెలుస్తుంది. సూత్రకారుల చేత పూర్వపక్షం చేసి ఖండింపబడిన

పాశుపతం మొదలైన తాంత్రిక సిద్ధాంతాలను శ్రీరామానుజులు బ్రహ్మసూత్రాలకు అనుగుణంగా ఖండించిన రీతిని బట్టి కూడా ఈ మతం తాంత్రిక మతానుసారం అని చెప్పడానికి సాధ్యం కాదు. అంతేకాకుండా, అక్కడక్కడ సూత్రార్థాలను వివరించే సందర్భాలలో భగవద్రామానుజులు "వర్ణాశ్రమ ధర్మాను గృహీత తదుపాసనరూప తత్సమారాధనప్రీతః "అని ఈ విధంగా వివరించడాన్ని బట్టి, ఆ విధంగానే, తృతీయాధ్యాయంలో కూడా వర్ణాశ్రమ ధర్మాల వివరణను సూత్రాలకు అనుగుణంగా చేయడం వల్ల ఈ సిద్ధాంతంలో వర్ణాశ్రమధర్మాలకు ఎక్కడా త్యాగం అంగీకరింపబడినట్లు నిష్పక్షపాతంగా చూచేవారికి తోచదు.

## విశిష్టాద్వైత సిద్ధాంతంలో అంగీకరించబడిన తత్వాలు

ఈ సిద్ధాంతంలో బ్రహ్మమనే తత్వం ఒక్కటే అంతటికీ మూలం– అని చెప్పబడింది. అయితే, ఆ బ్రహ్మ తత్వం అద్వైత మతంలో చెప్పబడినట్లుగా నిర్విశేష కూటస్థ కేవల చైతన్య రూపమైనది అని చెప్పబడలేదు. తనలో అపృథక్ సిద్ధంగా ఉండే, అంటే, ఏ సమయంలోనూ వేరుపడి ఉండకుండా ఉండే స్వభావాన్ని కల అచిత్తు, అంటే, ప్రకృతి, చిత్తు, అంటే, జీవులు అనే వీటిలో కూడినదై, సవిశేషంగానూ, సగుణంగానూ, పరమచేతనంగానూ, అంటే, ఉత్తమమైన చైతన్యాన్ని కలిగినదిగాను ఉంటుంది. అందుచేత ఈ సిద్ధాంతంలో ఒక విధంగా ప్రపంచం ఏకతత్వంనుండి, అంటే, మూల పదార్థంనుండి పుట్టినదని, ఇంకొక విధంగా, మూడు తత్వాలు, అంటే, చిత్తు అచిత్తు, ఈశ్వరులు– అనే మూడు తత్వాల మూలంగా జనించిందని చెప్పబడుతున్నది.

ఇది ఏ విధంగా పొసగుతుంది? అనే సంగతిని తెలుసుకోవడం కోసం ఒక ఉదాహరణను చూద్దాం. ఒక మామిడిపండును తీసి చూసినప్పుడు, దానిలో ఇమిడి ఉండే అన్ని భాగాలతో కలసి ఉండేటప్పుడు అది ఒకటే అని అంటాము. పండులోని పై పొరలోని సన్నివేశాన్ని, లోపల టెంక అనే భేదాన్ని గమనించి చూసినప్పుడు, అది అనేక పదార్థాలతో కలసినదని చెప్పవలసి ఉంటుంది. ఆ విధంగానే, జగత్తు కూడా అనేక

తత్వాల కూటమని తెలియాలి. కానీ ఇక్కడ ఒక విశేషం మాత్రం ఉన్నది. మామిడిపండులోని ఆ యా భాగాలను వేరుగా చేసినా, అవి ప్రత్యేకంగా గోచరిస్తాయి. కానీ, ఈ బ్రహ్మంతో కలిసి ఉండే చిత్తు, ఆచిత్తు అనే తత్వాలు వేరుపడవు. వేరుపడి నిలువ లేవు. ఇది ఈ తత్వాల స్వభావం. అందుచేత మనం తెలుసుకోవలసినది ఏమి? అంటే, ఈ మతంలో చిదచిత్తులలో కూడి ఉండే, అంటే, వాటిలో విశిష్టంగా ఉండే, బ్రహ్మ తత్వం ఒకటే ప్రపంచానికి మూలమని, అటువంటి తత్వం శుద్ధ చైతన్యస్వరూపం మాత్రం కాక, ఉత్తమ జ్ఞానవిశిష్టమైన, పరమచేతనమైన స్వరూపమని, ఈ బ్రహ్మంతో కూడి ఉండే చిత్తు, అచిత్తులు అనేవి స్థూలరూపంగా ఉండే ప్రపంచ కార్యావస్థలోనూ, సూక్ష్మ రూపంగా ఉండే కేవల కారణావస్థలో కూడా పరమాత్మను విడచి ఉండజాలని నిత్యసంబంధాన్ని కలిగి ఉంటాయని తెలుస్తున్నది— అని మనం గమనించాలి.

**ఈ సిద్ధాంతంలో తత్వవిభాగం**

ఒక విధంగా చూస్తే ఒకటే అనేటట్లు ఉండేది, ఇంకొక విధంగా చూస్తే మూడుగా చెప్పదగినది అని విధంగా ఉండేది అయిన బ్రహ్మమే ఈ ప్రపంచ మూల పదార్థం. ఇది మునుముందు ప్రమాణమని, ప్రమేయమని రెండు విధాలుగా చెప్పబడుతుంది. అందులో, ప్రమాణం— ప్రత్యక్షం, అనుమానం, శబ్దం అని మూడు విధాలుగా ఉండే జ్ఞాన రూపం. ప్రమేయం అనేది —ద్రవ్యమని, అద్రవ్యమని రెండు బేధాలను కలిగిన జ్ఞేయరూపం.

ప్రమాణాలలో ప్రత్యక్షం అనేది, ఆయా ఇంద్రియాల ద్వారా కలిగే జ్ఞానాన్ని బట్టి చాక్షుషం, శ్రావణం, ఘ్రాణం, రాసనం, త్వాచం, మానసం అని ఆరు విధాలుగా ఉంటుంది. వీటిలో, మానస జ్ఞానం, మళ్లీ అనుభవం అని, స్మృతి అని రెండు విధాలు. కన్ను మొదలైన బాహ్యేంద్రియ సహకృతమై, విషయాలను అవగాహించే జ్ఞానం అనుభవం అనబడుతుంది. ఆ విధంగా ఇంద్రియాల సహకారం లేకుండా, పూర్వం అనుభవించిన విషయాలను అవగాహించేది స్మృతి అనబడుతుంది. దీనికే స్మరణ అని కూడా పేరు.

ప్రమేయభేదమైన ద్రవ్యం అనేది జడమని, అజడమని రెండు విధాలుగా ఉంటుంది. జడమంటే –తనను తాను తెలుసుకోలేనిదై, ఇతరులచే మాత్రం తెలియబడేదిగా ఉండేది. అజడం అంటే– తనను తానే తెలుసుకోగలిగినదై, ఇతరులచే కూడా తెలియబడేదిగా ఉండేది. వీటిలో, జడం అనేది –ప్రకృతి, కాలం– అని రెండు విధాలు. వీటి అవాంతర భేదాలు తర్వాత వివరింపబడతాయి. అజడతత్త్వం జీవుడు, ఈశ్వరుడు, నిత్యవిభూతి, ధర్మభూత జ్ఞానం –అని నాలుగు విధాలు. వీటి వివరణ కూడా తరువాత చెప్పబడుతుంది. ఈ విధంగా ద్రవ్యమనేది ఆరు భేదాలను కలిగి ఉన్నది.

అద్రవ్యం అనేది సత్త్వం, రజస్సు, తమస్సు, రూపం, రసం, గంధం, స్పర్శం, శబ్దం, సంయోగం, శక్తి –అని పది భేదాలను కలిగి ఉన్నది. అద్రవ్యం అనేది ఎల్లప్పుడూ ద్రవ్యాన్ని. ఆశ్రయించుకునే ఉంటుంది. కనుక సత్త్వం మొదలు శబ్దంవరకు ఉండే ఎనిమిది ప్రకృతి అనే ద్రవ్యాన్ని, (రజస్సు, తమస్సులు, కాలం, నిత్యవిభూతి, శుద్ధసత్త్వం, రజస్సు, తమస్సు, సత్త్వం కూడా ప్రకృతిని) ఆశ్రయించి ఉంటాయి.

సంయోగం శక్తి అనే ఈ రెండు జడ– అజడ ద్రవ్య సాధారణంలో అంతటా ఆశ్రయించి ఉంటాయి. ఈ విధంగా తత్త్వం అనేక అవాంతర భేదాలను కలిగి ఉన్నది. అటువంటి భేదం అంతా కార్యరూపమైన స్థూలావస్థలోనే కనిపిస్తూ, నామరూప విభాగాలను చేయడానికి వీలుగా ఉంటుంది. సూక్ష్మ రూపమైన కారణావస్థలో నామరూప విభాగాలను చేయడానికి సాధ్యం కానిదిగా, సత్ అనే అవస్థలో మాత్రం ఉంటుంది.

### ప్రమాణ ప్రమేయాల వివేకం

పైన వివరించిన తత్త్వ విభాగంలో ప్రమాణం జ్ఞానరూపమని చెప్పి, మళ్ళీ, ప్రమేయం లో కూడా ధర్మభూత జ్ఞానం ఒకటి అని చెప్పాము కదా. అందువల్ల ఇక్కడ

ఒక సందేహం కలిగే అవకాశం ఉన్నది. జ్ఞానం అనేది ప్రమాణ రూపమా? లేక, ప్రమేయ రూపమా? లేక, రెండు విధాలుగా ఉంటుందా? అని అంటే, జ్ఞానం ఉభయాత్మకం అనేదే మన సిద్ధాంతం. ఉభయాత్మకంగా ఉండే ఈ జ్ఞానం అంతా ద్రవ్యమే. ఇది జీవుడు ఈశ్వరుడు –అని రెండు విధాలైన అజడ ద్రవ్యాలతో ఎల్లప్పుడూ కలసి ఉంటుంది. అందుచేత జ్ఞానం ఆత్మేశ్వర ధర్మరూపమై, ధర్మభూత జ్ఞానం అని చెప్పబడుతున్నది. అంతేకాకుండా, అజడ పదార్థాలు అయిన జీవుడు, ఈశ్వరుడు స్వయం ప్రకాశ రూపులు కావడం చేత, జ్ఞానరూపులుగా ఉంటారు. జీవేశ్వరులు జ్ఞాన రూపులుగా ఉండి జ్ఞానాన్ని కలిగినవారుగా కూడా ఉంటారు, అంటే, జ్ఞానాన్ని గుణంగా కలిగినవారుగా కూడా ఉంటారు. అందుచేత, జ్ఞాన రూపులు జీవేశ్వరులు కావడం చేత, ఈ జ్ఞానం ధర్మరూపం మాత్రం కనుక, దీనికి ఈ విధంగా ధర్మభూత జ్ఞానం అనే పేరు వచ్చింది. ప్రమాణ జ్ఞానం కూడా ధర్మభూత జ్ఞానంలోనే చేరుతుంది. అందుచేత అది ప్రత్యేకం కాదు.

అయితే, ఆ ప్రమాణ జ్ఞానం కేవలం జీవధర్మమే కానీ, ఈశ్వర ధర్మం కాదు. ఎందుకంటే, ఈశ్వర ధర్మభూత జ్ఞానం ఇతరానధీనంగా భాసించేది అవడం చేత, ఇంద్రియాది సహకృతమై భాసించనక్కర లేనిది. దీనికి ప్రమాణం ఏమీ అంటే, " పశ్యత్యచక్షుః, స శ్రుణోత్యకర్ణః" (అంటే, ఇంద్రియాలు మొదలైనవాని అధీనంగా ఉండే జ్ఞానం ఆ పరమాత్మకు లేదు. వాటి అపేక్ష లేకుండానే అంతటినీ తెలుసుకుంటున్నాడు– అని భావం) అనే ఈ శ్రుతి వాక్యం ప్రమాణం. ఇందుచేత మనం తెలుసుకోవలసినది ఏమి అంటే, ప్రమాణ జ్ఞానమని, ప్రమేయ జ్ఞానమని వేరుగా లేవు. ప్రమేయమైన ధర్మభూతజ్ఞానంలోనే జీవధర్మమాత్రంగా ఉండేది ప్రమాణ జ్ఞానం –అని గ్రహించాలి.

ఇక, ఉద్దేశానుసారంగా ప్రమాణ ప్రమేయ భేదాలు వివరింపబడుతున్నాయి.

**ప్రమాణాలు**

ఈ మతంలో ప్రత్యక్షం, అనుమానం, శబ్దం– అని మూడే ప్రమాణాలు. ఇతర శాస్త్ర కారులు అయితే, ఇంతకంటే, ఉపమానం, అర్థాపత్తి, సంభవం, (స్మృతి) యోగ్యనుపలబ్ధి, (అభావం) ఐతిహ్యం అనే ఐదింటిని కూడా చేర్చి ప్రమాణాలు 8 అని చెప్పారు. ఏ విధంగా అంటే–

ప్రత్యక్షమేకం చార్వాకః కాణాదః సుగత పునః,
అనుమానం చ తచ్చాపహుః సాంఖ్యా శబ్దం చ తే అపి,
న్యాయైకదేశినోఽప్యేవ ముపమానం కేచన,
అర్థాపత్యా సహైతాని చత్వార్యాహ ప్రభాకరః
అభావ షష్ఠాన్యేతాని భాట్టవేదాంతిన స్తథా,
సంభవైతిహ్యయుక్తాని తాని పౌరాణికా జగుః"

చార్వాకులు ––– ప్రత్యక్షము మాత్రమే (1)
కాణాదులు. –––– ప్రత్యక్షం, అనుమానం (2)
(ప్రాచీన తార్కికులు)
బౌద్ధులు. –––ప్రత్యక్షం, అనుమానం (2)
సాంఖ్యులు. –– ప్రత్యక్ష, అనుమాన, శబ్దాలు (3)
నైయాయికులు ––– ప్రత్యక్ష, అనుమాన, శబ్దాలు (3)
(నవీనతార్కికులు)
6) వీరిలోనే కొందరు–– ప్రత్యక్ష, అనుమాన ఉపమాన శబ్దాలు (4)
7) మీమాంసకులలో––– పై నాలుగుతో పాటు, అర్థాపత్తి కూడా (5)
ప్రాభాకరులు
8) మీమాంసకులలో––– పై ఐదింటితోపాటు యోగ్యానుపపత్తి (6)
భాట్టమతస్థులు

9) అద్వైతులు ———పై ఐదింటితోపాటు యోగ్యానుపపత్తి (6)

ప్రాచీనులు –

10) పౌరాణికులు—— పై ఆరింటితోపాటు సంభవం, ఐతిహ్యం (8)

కానీ వారిలో వారే ప్రమాణాల విషయంలో వివాదపడ్డారు. చివరకు మిగిలిన ఇతర ప్రమాణాలను ప్రత్యక్షం, అనుమానం, శబ్దం— అనే మూడు ప్రమాణాలలో అంతర్భవింపచేసి, ఈ మూడిటినే ప్రత్యేక ప్రమాణాలుగా స్థిరపరిచారు. విశిష్టాద్వైత మతంలో ఈ సిద్ధాంతిత ప్రమాణ త్రయాన్నే అంగీకరించి వ్యవహరించారు.

**ప్రత్యక్షం**

ఇంద్రియ జన్యమైన జ్ఞానం ప్రత్యక్షం. ఇది, లౌకికమని, అలౌకికమని రెండు విధాలుగా ఉంటుంది. అందులో, లౌకిక ప్రత్యక్షం సర్వజన సాధారణమైనది. అలౌకిక ప్రత్యక్షం యోగులకు మాత్రం కలుగుతుంది. లౌకిక ప్రత్యక్షం, మళ్లీ, నిర్వికల్పం, సవికల్పం అని రెండు విధాలు. నిర్వికల్పం అనేది మొదటి క్షణంలో కలిగేది. సవికల్పం ద్వితీయ క్షణంలో ఉండేది. ఈ ప్రత్యక్షం అంతా సవిశేష పదార్థ విషయమే కానీ, నిర్విశేష పదార్థాన్ని గోచరింపజేసేది కాదు. అందుచేత, నిర్విశేషమైన పదార్థాన్ని ప్రత్యక్ష గోచరింప జేయదు— అనేది సిద్ధాంతం.

**అనుమానం**

ప్రత్యక్ష ప్రమాణం వల్ల గ్రహింపబడిన పదార్థంలోని పరస్పర సాహచర్య నియమజ్ఞానంవలన కలిగిన వ్యాప్తి జ్ఞానంచేత కలిగే జ్ఞానానికి అనుమానం— అని పేరు ఇందులో, పంచావయవ వాక్య రచన, హేతుదోషాలు నైయాయికాది శాస్త్ర కారులు అంగీకరించినట్లే ఉంటాయి. విస్తర భీతిచేత వివరించడం లేదు.

**శబ్దప్రమాణం**

"అనాప్తానుక్తం వాక్యం శబ్దః" అని, " కరణదోషబాధకాభావవత్ శబ్దః" అనే లక్షణాలతో నిర్వచింపబడినది, శబ్ద ప్రమాణం. అటువంటిది వేదమే అవుతున్నది, వేదం అపౌరుషేయం అని పలువురు శాస్త్రకారులు నిర్ణయించడం చేత, పురుషమాత్రుని చేత రచింపబడని వాక్యం వేదం కనుక, అనాప్తుడైనవానిచే చెప్పబడని వాక్యం అది.

**వేదం**

అందువల్లనే కరణ దోషాల చేత ఏర్పడే బాధ ఈ వేదమనే వాక్యానికి లేదు. కనుక, ఇదే నిర్దుష్టమైన ప్రమాణం అవుతున్నది. వేదానికి అపౌరుషేయత్వం ఉన్నదని శ్రీ వేదవ్యాసులే ప్రమితాధికరణంలో సాధించారు. అది విస్తర భయం వల్ల ఇక్కడ వివరింపబడడం లేదు.

అటువంటి వేదాన్ని, దానికి ఉపబృంహణాలు అయిన స్మృతి ఇతిహాస పురాణాలను శబ్ద ప్రమాణాలుగా విశిష్టాద్వైత మతం అంగీకరించింది.

**ప్రమేయం**

ప్రమాణ జ్ఞానానికి విషయమైనది అంతా ప్రమేయమే అనబడుతుంది. ఇది అనేక భేదాలను కలిగి ఉన్నది– అనే విషయం ఇంతకుముందే వివరింపబడింది. ఇందులో, ద్రవ్యరూపమైన ప్రమేయాన్ని ముందు వివరించి, తరువాత అద్రవ్యాన్ని వివరించడం జరుగుతుంది.

**జీవుడు**

అజడప్రమేయాలలోకి జీవులు చేరుతారు. మీరు చిత్తు, ఆత్మ అనే పదాలతో ఈ సిద్ధాంతంలో వ్యవహరింపబడతారు. వీరు అనేకులు. అణుస్వరూపులు, జ్ఞాన స్వరూపులు. జ్ఞానాన్ని గుణంగా కలవారుగా కూడా ఉంటారు. వీరు ఈశ్వరునకు

అంశభూతులు. అనగా, ఈశ్వరునిలో శరీరంగా చేరి ఉండి, ఆ స్వామి సంకల్పవశంచేత, మండే అగ్ని నుండి మిణుగురులు బయటపడేటట్లు, వేరుగా భాసిస్తూ ఉంటారు. వాస్తవంగా భగవంతుని కంటే జీవులు భిన్నులే అయినా, ఈశ్వరుని విడిచి స్థితిని పొందనివారు కావడం చేత ఈశ్వరునకు అంశభూతులవుతున్నారు. వీరు నిత్యమైనవారే. వీరికి నాశనం లేదు.

ఇటువంటి జీవులు నిత్యులు, ముక్తులు, బద్ధులు— అని మూడు విధాలుగా ఉంటారు. నిత్యులు అనేవారు ఏ సమయంలోనూ ప్రకృతి సంబంధం లేనివారై, తమ ధర్మభూత జ్ఞానానికి ఏ సమయంలోనూ సంకోచం లేనివారై ఉంటారు. వీరే అనంత గరుడ విష్వక్సేనాదులు.

ముక్తులు అనేవారు ఒకానొక సమయంలో కర్మ వశంచేత ప్రకృతి సంబంధాన్ని కలిగినవారై, తరువాత తమ ప్రయత్నంతో ఆ బంధాన్ని తీర్చుకొని, స్వరూప ప్రాప్తిని పొందినవారు. వీరే దివ్యసూరులు, పూర్వాచార్యులు.

బద్ధులంటే— కర్మమూలకమైన ప్రకృతి సంబంధం వదలనివారు. వీరు బుభుక్షువులని, ముముక్షువులని రెండు విధాలుగా ఉంటారు. బుభుక్షువులు, అపూర్వైశ్వర్యాన్ని కోరేవారని, పోగొట్టుకున్న ఐశ్వర్యాన్ని తిరిగి పొందాలని కోరేవారని రెండు విధాలుగా ఉంటారు. అంతవరకు లభించని భోగాన్ని పొందాలని కోరేవారు అపూర్వైశ్వర్య కాములు. మధ్యలో నశించిన భోగాన్ని విరిగి పొందాలని కోరేవారు భ్రష్టైశ్వర్య కాములు.

ముముక్షువులు కూడా, కైవల్యాన్ని కోరేవారని, భగవత్ప్రాప్తిని కోరేవారని రెండు విధాలుగా ఉంటారు. ప్రకృతి సంపర్కం విడిచిపెట్టి, కేవలం స్వాత్మానుభవాన్ని

కోరేవారు కైవల్యకాములు. ప్రకృతి సంపర్కం నశించిన తరువాత ఈశ్వరానుభవ పూర్వకమైన స్వాత్మానుభవాన్ని కోరేవారు భగవత్ప్రాప్తికాములు.

ఇంతే కాక, జీవులకు అపహత పాప్మత్వం, విజరత్వం విమృత్యుత్వం, విశోకత్వం, విజిఘత్సత్వం, అపిపాసత్వం, సత్యకామత్వం, సత్యసంకల్పత్వం– అనే 8 గుణాలు స్వాభావికంగా ఉంటాయి. కాని, వీటిలో, సత్యకామత్వం, సత్య సంకల్పత్వం– అనేవి మాత్రం ఈశ్వరుని అధీనంలోనే ఉంటాయి. ఈ ఎనిమిది గుణాలు బద్ధులై ఉండే దశలో ప్రకృతి సంబం చేత సంకోచాన్ని పొందుతాయి. శ్రియఃపతిత్వం, జగజ్జన్మాది కారణత్వం, సర్వతంత్ర స్వతంత్రత్వం మాత్రం జీవులకు ఏనాడు కూడా ఉండవు. అవి కేవలం ఈశ్వరుని గుణాలే. ఇంకా జీవులకు సంబంధించిన వివరాలు విస్తర భయం వల్ల తెలుపడం లేదు.

**ఈశ్వరుడు**

విశిష్టాద్వైత సిద్ధాంతంలో ఈశ్వరుడు అంటే సర్వ నియంత అయిన పరబ్రహ్మ. ఈ ఈశ్వరుడు విభువు. అంతటా వ్యాపించి ఉంటాడు. అన్నిటికీ ఆధారమైనవాడు. సర్వస్వామి. సకల కర్మలచే ఆరాధింపబడే వాడు. అన్ని ఫలాలను ఇచ్చేవాడు. పరమ చేతన స్వరూపుడు. బ్రహ్మస్వరూప బోధకాలైన ఉపనిషత్తులు అనబడే వేదాంతాలలో అనేక నామాలతో బ్రహ్మ నిర్దేశింపబడ్డాడు. బ్రహ్మ పదార్థమే సకల జగత్తుకు కారణ వస్తువు అని చెప్పినందు, ఈ బ్రహ్మ ఎటువంటిది? అని వేదాంత సూత్రాలు అనబడే వేదవ్యాస సూత్రాలలో విచారణ చేయబడింది.

సామాన్య విశేషన్యాయం

అనేక న్యాయ ద్రష్టలైన పూర్వమీమాంసకులు వేదంలో చెప్పబడిన పదాలకు అర్థ నిర్ణయాన్ని చేయడం కోసం సామాన్య విశేష న్యాయం అనే ఒక న్యాయాన్ని అంగీకరించారు. "పశునా యజేత" అనే విధి వాక్యంలో పశు సామాన్య వాచకమైన

పశుశబ్దానికి అర్థాన్ని నిర్ణయించవలసి వచ్చినప్పుడు, యాగంలోని "ఛాగస్య వపాయాః మేధసోఽనుబ్రూహి"అని మొదలైన వాక్యంలోని ఛాగపదప్రయోగాన్నిబట్టి, పశుశబ్దానికి ఛాగమే (మేక) అర్థమని నిర్ణయించారు. ఆ న్యాయాన్ని విశిష్టాద్వైతులు అంగీకరించి, వినియోగించి, సత్, బ్రహ్మ, ఆత్మ, శివ, శంభు, హిరణ్యగర్భ మొదలైన శబ్దాలతో నిర్దేశింపబడిన జగత్కారణ వస్తువును ఆధర్వణిక మహోపనిషత్తులోని కారణ వస్తు బోధకమైన నారాయణ పదంలో పర్యవసానాన్ని చెప్పి, యోగరూఢమైన నారాయణ పదంచేత బోధింపబడే వస్తువే జగత్కారణమని నిర్ణయించారు.

**ఈశ్వర స్వరూప వివరణం**

ఈశ్వరునకు సకల జగత్తుకు ఉత్పత్తి స్థితిలయాలలో కర్తృత్వాన్ని ఉపనిషత్తులు విశేష లక్షణంగా తెలియజేశాయి. ఈశ్వర వ్యాపారం అనేది కేవల సంకల్పమాత్రం చేతనే నిర్వహింపబడుతుందని కూడా చెప్పబడింది. ఈ విషయం, తరువాత, ప్రకృతి నిరూపణలో వివరింపబడుతుంది. ప్రళయాలలో, మహాప్రయానంతరం సూక్ష్మావస్థలో సకల జగత్తు ఈశ్వరునిలో, అంటే, , బ్రహ్మలో లీనమై నామరూపాలు లేకుండా ఉంటుంది. తిరిగి ఈశ్వరుని సంకల్ప వశంతో సమస్తివ్యష్టి సృష్టి అంతా జరిగి, సర్వాధారుడైన ఈశ్వరునియొక్క అంతర్వ్యాప్తి, బహిర్వ్యాప్తి వలన స్థితిని పొంది, తిరిగి బ్రహ్మలో ప్రళయ కాలంలో లయాన్ని పొందుతుంది. సృష్టి వ్యవస్థలోనే కాలం వ్యక్తమై, సూర్యస్పందాదులతో అవిచ్ఛిన్నంగా అనేక వ్యవహారాలకు హేతువు అవుతున్నది. ప్రళయ కాలంలో కాలం నామరూప విభాగం లేకుండా, బ్రహ్మ లోనే లీనమై ఉంటుంది. అందుచేత లయానికి కాలావచ్ఛేదం లేదు.

సృష్టి తరువాత ఈశ్వరుడు తన స్వరూపాన్ని చేతనులైన జీవులకు ఉపయోగం కోసం ఐదు విధాలుగా చేస్తాడు. అవి, పరం, వ్యూహం, విభవం, అంతర్యామి, అర్చ అనేవి. ఈ స్వరూప భేదం అంతా తన యొక్క సర్వకర్మారాధ్యత్వ, సర్వఫలప్రదత్వ,

సర్వాధారత్వాలను నిర్వహించడం కోసమే. ఇదంతా జీవులకు ఉపయోగం కోసమే అవుతున్నది. తన యొక్క విభుత్వ, పరమచేతనత్వాలు సర్వదా సమస్త చేతనాచేతనాల నిర్వహణ కోసం ఉపయోగించేవి. అపహతపాప్మత్వం మొదలైన 8 గుణాలు, సర్వ స్వతంత్ర సంకల్పత్వం ఈశ్వరునకు ఇతరాధీనాలుగా ఉంటాయి.

పైన తెలుపబడిన ఈశ్వరుని ఐదు భేదాలు దేశకాలావచ్ఛిన్నాలైన ఈ కార్యరూప ప్రపంచానికే ఉపయోగపడతాయి. కారణావస్థారుపమైన, దేశ కాలాద్యనవచ్ఛిన్నమైన మహాప్రళయావస్థలో ఇవి ఉండవు. అటువంటి రెండు అవస్థలలోనూ చిత్తు, అచిత్తు అనేవి బ్రహ్మానికి శరీరాలుగా ఉన్నవై, దానితో విడిపోకుండా ఉంటాయి. బ్రహ్మానికి శరీరాలుగా ఉండడం అంటే– బ్రహ్మాను ఆధారాలుగా కలిగినవై, బ్రహ్మం యొక్క సంకల్పాన్ని అనుసరించి వర్తించేవై, బ్రహ్మానికి తమ సంబంధం వల్ల కొంత అతిశయాన్ని, అంటే, వైలక్ష్యణ్యాన్ని కలిగించేవిగా ఉంటాయి– అని అర్థం. దీనినే "ఆధేయత్వవిధేయతశేషత్వాదీని శరీర పద ప్రవృత్తి నిమిత్తాని " భగవద్రామానుజులు శీభాష్యంలో నిర్ధారణ చేసి చెప్పారు.

ప్రపంచ రూప కార్యావస్థలోనూ, సద్రూపంగా ఉండే కారణావస్థలో కూడా ప్రకృతి పురుష బ్రహ్మాలకు సంకరం కలుగదు. కానీ, కారణావస్థలో సూక్ష్మరూపావస్థను పొందుతాయి. పురుషులు నిత్యం ముక్తాది భేదాలకు సాంకర్యం లేకుండా ఉంటారు. అందువల్ల తిరిగి సృష్టి దశలో అంతవరకు ముక్త దశను పొందిన ఆత్మలు తిరిగి ప్రకృతి బద్ధులు కారు. అనాది కర్మవిమోచనం లేని బద్ధాత్మలకే తిరిగి ప్రకృతి సంబంధం కలుగుతుంది. వారిలో కొందరు ఈశ్వర విశేష కటాక్ష స్వరూప సంకల్ప విశేషంవల్ల ముముక్షువులై, వారి వారి యోగ్యతకు అనుగుణంగా కర్మ జ్ఞాన భక్తి ప్రపత్తి రూపాలైన ఉపాయాలను అనుష్ఠించడం వల్ల భగవంతునకు ప్రీతిని కలిగించి, భగవదనుభవగర్భమైన మోక్షాన్ని పొంది, దేశ విశేషమైన నిత్యవిభూతిని చేరి, తిరిగి సంసార రూపమైన ప్రకృతి సంబంధాన్ని పొందరు. బద్ధాత్మలకు సంఖ్యా నియమం

లేనందున, కొన్ని దినాలకు బద్ధాత్మలే లేకుండా ఉండే స్థితి ఈ లీలావిభూతికి సంభవించదు— అని ఈ సిద్ధాంతసారం.

### ఈశ్వరుని లక్ష్మివిశిష్టత్వం

"ఆనీదవాతం స్వధయా తదేకమ్" అనే వేద వాక్యాన్ని అనుసరించి సత్, బ్రహ్మ మొదలైన పదాలచే చెప్పబడేది, నారాయణానామాన్ని ప్రధానంగా కలిగినదైన ఈశ్వర తత్వాన్ని నిత్యచేతనులలో ఒక ఆత్మ అయిన, లక్ష్మి, శ్రీమొదలైన శబ్దాల చేత చెప్పబడుతూ, , స్థూలసూక్ష్మావస్థారూప కార్యకారణావస్థలలో విశేషమైన సంశ్లేషాన్ని, అంటే, సంబంధాన్ని బ్రహ్మతో కలిగినదై ఉంటుంది— అని ఈ సిద్ధాంతంలో చెప్పబడుతున్నది.

### ఉభయ లింగత్వం

వేదాంతాలలోని సగుణ శ్రుతులు, నిర్గుణశ్రుతులు— అనే రెండు విధాలయిన వాక్యాలను శ్రుతి వాక్యాలనే ఆధారంగా చేసికొని సమన్వయంచేసి, సగుణ శ్రుతులకు కల్యాణ గుణ విశిష్టత్వంలో తాత్పర్యాన్ని, నిర్గుణ శ్రుతులకు హేయ గుణ రాహిత్యంలో తాత్పర్యాన్ని చెప్పి, "నిఖిల హేయ ప్రతిభటుడు, కళ్యాణ గుణాకరుడు —ఈశ్వరుడు " అని ఈ సిద్ధాంతంలో స్థాపించబడింది. ఇంకా వివరాలు విస్తరభయంవల్ల వ్రాయలేదు.

### నిత్య విభూతి

ద్రవ్యాలలోని అజడాలలో, నిత్యవిభూతి కేవలసత్వంతో కూడినది ఉంటుంది, కానీ, అది పరాక్ అనబడుతుంది, అంటే, తన సత్త తనకు ఉపయోగించక, జీవేశ్వరులకే ఉపయోగపడేదిగా ఉంటుంది— అని తాత్పర్యం. దీనివలెనే, పైన వివరించబోయే ధర్మభూత జ్ఞానం కూడా పరాక్కుగానే ఉంటుంది.

నిత్య విభూతి అనే పేరు దీనికి కలగడానికి ఏమి కారణం? అంటే, ప్రళయావస్థలో కూడా దీని స్వరూపం నశించకుండా, ఈశ్వర జీవ శరీరాదిస్వరూపంతోనూ, వారి స్థితికి ఆధారప్రదేశాన్ని రూపంతోనూ ఉండడమే. దీనికే త్రిపాద్విభూతి అనే పేరు కూడా ఉన్నది. త్రిగుణమయ ప్రకృతి వికారంవల్ల పుట్టిన ఈ ప్రపంచం ఒక భాగం కాగా, ఇది దానికి మూడు రెట్లు ఉంటుంది కనుక, ఈ పేరు దీనికి వచ్చింది.

త్రీపాద్ విభూతి పంచోపనిష త్ ప్రతిపాద్య పంచభూత రూపంగానూ, ఏకాదశ ఇంద్రియ రూపంగానూ ఉండి, 16 భేదాలను కలిగినదై ఉంటుంది. ఈశ్వరునకు, నిత్యముక్త రూపజీవులకును లక్ష్మి మొదలైన పదాలతో చెప్పబడే దివ్యమహిషీ గణానికి శరీర పరిచ్ఛదాది రూపంగానూ, దివ్యదేశరూపంగానూ ఉండేదై, ఈ నిత్యవిభూతి ఉపకరిస్తుంది.

**ధర్మభూతజ్ఞానం**

ఇది కూడా ఆజడంగాను, పరాక్కు గాను ఉంటుందని ఇంతకుముందే చెప్పబడింది. త్రివిధాలుగా ఉండే జీవులకు, ఈశ్వరునకు అవినాభావంగా ఉండే ధర్మం, ఈ జ్ఞానం. ఇది సంకోచ వికాసరూపాలలోని అవస్థలను కలిగినది. బద్ధ జీవులకుండే జ్ఞానం సంకోచాన్ని పొందుతుంది. నిత్యులకు, ముక్తులకు, ఈశ్వరునకు ఉండే ధర్మభూత జ్ఞానం వికాసాన్ని పొంది ఉంటుంది. జ్ఞానం ప్రతి వ్యక్తికి భిన్న భిన్నాలుగా ఉండడంచేత, ఇదికూడా భిన్న భిన్నంగా ఉంటుంది. ఇది తనకు ఆశ్రయంగా ఉండే జీవేశ్వరులను వదలకుండా ఉండి, ఇతర చోట్లకు వ్యాపిస్తూ, తిరిగి సంకోచాన్ని పొందుతుంది. ఇచ్ఛ, సంకల్పం మొదలైనవి అన్నీ ఈ జ్ఞానం యొక్క అవస్థా విశేషాలే కానీ, వేరు కావు. ఇది సూర్యునకు ఎండ వలె, దీపాలకు రత్నాలకు కాంతి వలె, జీవేశ్వరులకు అవినాభుతంగా ఉండడం చేత ధర్మమైనది, సంకోచ వికాసాది అవస్థలను కలిగి ఉండడం చేత ద్రవ్యమైనది. ద్రవ్యమైనప్పటికీ సూర్యాతపాదులలో ధర్మం ద్రవ్యంగా

ఉండడం మనం చూస్తున్నాము. కనుక, ఈ విధంగా ఉండడం, అంటే, ధర్మమైనా ద్రవ్యంగా ఉండడం విరుద్ధం కాదు.

ఈ ధర్మభూతజ్ఞానం ప్రమాణ ప్రమేయోభయాత్మకమైనది– అని ఇదివరకే చెప్పబడింది. జ్ఞానాంతరాలకు విషయమై ఉండడంచేత జ్ఞేయం అవుతున్నది. స్వయంగా ప్రసరించే సమస్తాన్ని అవగాహహించేది కావడం చేత జ్ఞానం అవుతున్నది. జ్ఞానం విభుద్రవ్యమని విశిష్టాద్వైత సిద్ధాంతం.

నైయాయికులు మొదలైనవారివలనే ఈ సిద్ధాంతంలోనివారు కూడా భ్రమాత్మక జ్ఞానాన్ని అంగీకరించరు. జ్ఞానం అంతా యథార్థమే అనేది ఈ సిద్ధాంతం. ముత్యపు చిప్పలో వెండి ఉన్నదనే జ్ఞానం, ఒక చంద్రునిలో ఇద్దరు చంద్రులు ఉండడమనే జ్ఞానం, ఈ విధంగానే భ్రాంతి అని ఇతర మతాలవారు చెప్పే జ్ఞానాలన్నీ యథార్థాలే. ముత్యపు చిప్పలో ప్రకాశ ధావల్యాధిహేతువైన రజతాంశం కూడా ఉండటం చేత, జ్ఞానావరక దోషవిశేషం వలన (చీకటి మొదలైనవాని వల్ల) రజతాంశం మాత్రమే జ్ఞానంలో గోచరించి, శుక్తి భాగం గోచరించకుండగా ఉండడం చేత, "ఇది రజతం" అనే జ్ఞానం కలుగుతున్నది. ఆ విధంగానే, చంద్రుడు ఒకడే అయినప్పటికీ, చక్షురింద్రియ గతమైన తిమిరమనే దోషం వల్ల రెండు కళ్ళలో ఒకటిగానే చూడగలిగే శక్తి అడ్డుపడడం చేత, ప్రత్యేకచక్షుర్వృత్తులు ప్రత్యేకంగా విషయాన్ని గోచరిస్తాయి. అప్పుడు రెండు కళ్ళకు రెండు చంద్రుల వలె కనబడతుంది కానీ, లేని చంద్రుని మరి ఒకనిని అవగాహించడం కాదు. అందుచేత, ఇక్కడ కూడా విషయసత్తాప్రయుక్తమైన యథార్థ జ్ఞానత్వమే ఉన్నది. ఇంకా వివరాలు విస్తరభయం వల్ల తెలుపడం లేదు.

**ప్రకృతి –కాలం**

ద్రవ్యాలలో జడాలు –ప్రకృతి, కాలం –అనే తత్వాలు అని ఇంతకుముందే చెప్పబడింది. నిత్య విభూతిని కలుపు కొని ఇవి మూడును అచిత్తులు అనబడతాయి.

అద్రవ్యాలు అని చెప్పబడే సత్వం, రజస్సు, తమస్సులు ఈ ప్రకృతి, కాలాలలో ఉంటాయని చెప్పాము. ఇందులో, శుద్ధసత్వం అంటే, రజస్సు, తమస్సుల కలయిక లేని సత్వం. ఇది నిత్యవిభూతిలోనే ఉంటుంది. మిశ్రసత్వం అంటే, రజస్సు తమస్సుల కలయిక కలిగిన సత్వం. ఇది ప్రకృతిలో ఉంటుంది. కాలం సత్వ శూన్యం, అంటే, సత్వమే లేకుండా, కేవలం రజస్సు, తమస్సులను మాత్రం కలిగినదై ఉంటుంది. ఈ సత్వాదుల స్వరూపం అద్రవ్య నిరూపణంలో చెప్పబడుతుంది.

సాంఖ్య మతంలోవలె ఈ సిద్ధాంతంలో సత్వాది గుణ సముదాయమే ప్రకృతి అని అంగీకరింపబడదు. సత్వాదులతో కూడిన ద్రవ్య విశేషమే ప్రకృతి. ఇది సావయవం. దీని అవయవాలు నైయాయికులు చెప్పిన పరమాణువుల వంటివి కాదు. తత్తత్ ప్రదేశ కల్పనా మాత్రసాధకాలు. దీనివల్ల ఈశ్వర సంకల్పరూప జ్ఞానం ప్రకృతి యొక్క ఏ ఏ ప్రదేశాలలో "ఇక్కడ మహత్తు, ఇక్కడ అహంకారం, ఇక్కడ ఇంద్రియాలు, ఇక్కడ తన్మాత్రలు, ఇక్కడ పంచభూతాలు కలుగుగాక" అని సంయోగిస్తుందో, అక్కడక్కడ ఆయా తత్వాలు సృష్టింపబడతాయి. అందుచేత, ప్రకృతి స్వరూపాలతోనూ, మహత్తులు మొదలు పృథివి వరకు కలిగే 23 తత్వాల రూపంతోనూ, ప్రదేశ భేదంతోను అనుసరించి ఉండి, "24 తత్వాలను కలిగినది, ప్రకృతి" అని వ్యవహరించడానికి యోగ్యమై ఉన్నది. ప్రకృతి, మొదట, సర్వలయావస్థలో అవిభక్త తమస్సు అనే వ్యవహారాన్ని కలిగి ఉంటుంది. క్రమంగా విభక్తతమస్సు అని, బద్ధ జీవసమష్టితో కలసి అక్షరమని, అవ్యక్తమని సృష్టికి ఉన్ముఖంగా ఉండే అవస్థలలో పిలువబడి, తరువాత వ్యక్తావస్థగా మారిన ప్రదేశాన్ని బట్టి మహదాది రూపాలుగా మారుతూ ఉంటుంది. వ్యక్తావస్థకు పూర్వం ప్రకృతిలోని సత్వ రజస్తమస్సులు సమంగా ఉండి, సమ పరిణామాలను మాత్రమే కలిగిస్తాయి. అందువల్ల విరూప తత్వ స్వరూపం ప్రకృతికి అప్పుడు కలుగదు. వ్యక్తావస్థ ఆరంభం అవడానికి సత్వ రజస్తమస్సుల విషమ భావమే, అంటే, హెచ్చుతగ్గులు కలుగడమే కారణం. ఇది ఈశ్వర సంకల్పాధీనమని ఇంతకుముందే చెప్పబడింది కదా. ఈ విధంగా సమష్టి సృష్టి వల్ల 24 తత్వాలు ఏర్పడి,

తరువాత పంచభూతాలు ఈశ్వర సంకల్పాధీనంగా పంచీకృతాలై (ఒక భూతం యొక్క సగభాగంలో మిగిలిన నాలుగు భూతాల సగభాగంలోని నాలుగవ భాగంతో చేరినవై) , బ్రహ్మాండాది వ్యష్టిసృష్టి అంతా జరుగుతుంది. మళ్ళీ లయం అయ్యేటప్పుడు కూడా, అండ సృష్టి వరకు లయమై, పంచభూతాల పంచీకరణం పోయి, క్రమంగా పృథివి జలంలోనూ, జలం తేజస్సులోనూ –అనే ఈ క్రమంలో, మహత్తు అవ్యక్తంలోనూ, అది అక్షరావస్థలోనూ, అది విభక్త తమస్సు అనే అవస్థలోనూ, అది అవిభక్తతమస్సులోనూ, అది చిదచిద్విశిష్ట సూక్ష్మ బ్రహ్మ శరీరమైన అచిత్తులోనూ లీనమవుతూ ఉంటుంది.

**ప్రళయ వివరణం**

సందర్భవశాత్తు ప్రళయం గూర్చి తెలుపబడుతున్నది. ప్రళయం అంటే –కార్యం కారణంలోకి లీనమై పోవడం. ఇది నాలుగు విధాలుగా ఉంటుందని శాస్త్రమర్యాద. నిత్యప్రళయం, నైమిత్తిక ప్రళయం, ప్రాకృత ప్రళయం, ఆత్యంతిక ప్రళయం అని వాటికి పేర్లు.

ప్రతి దినం ప్రపంచంలో నిద్రావస్థలో ప్రకృతి విశిష్టాత్మలు అంతర్యామి బ్రహ్మలో లీనం అవుతూ ఉంటాయి. లేక, యముని ఆజ్ఞ చేత భౌతిక దేహాన్ని విడచి యమసాన్నిధ్యానికి కొందరు జీవులు చేరడానికి నిత్య ప్రళయం అనబడుతుంది. సృష్టిని చేయడానికి అధికారాన్ని పొందిన బ్రహ్మకు తన, మానం, అంటే, ఆయుస్సు, పూర్తి కావడం చేత కలిగే రాత్రిలో, ఆ బ్రహ్మతో పాటు సృజ్యాలైన సమస్త చేతనాచేతనాలు కార్యవర్తి బ్రహ్మలో లయం కావడమే నైమిత్తిక ప్రళయం అనబడుతుంది. అటువంటి సృష్టికర్తకు నిర్ణీతమైన జీవితకాలం ముగిసిన తరువాత, అతనితో సృజ్యవర్గం అంతా కారణ వర్తి బ్రహ్మలో లీనం కావడం ప్రాకృత ప్రళయం అనబడుతుంది. ఇంతవరకు త్రిపాత్, ఏకపాత్ అనే విభాగాలు ఉంటాయి. ప్రాకృతప్రళయంలో ప్రకృతి వ్యవస్థలు నశించిపోతాయి, కానీ, విభూతిలో భేదద్వయం ఉండదు. మహాప్రళయంలో మిశ్రసత్వసత్వశూన్య వస్తువులన్నీ అసంకీర్ణాలుగా, సూక్ష్మ

రూపంలో పరమ కారణ బ్రహ్మలో లీనమై ఉంటాయి. మహాప్రళయంలో కూడా నిత్యవిభూతి, దానిలో ఉండే నిత్యముక్త ఈశ్వర స్వరూపాలు తమ స్థితికి ఏ విధమైన మార్పు లేకుండా ఉంటాయని, సృష్టి, ప్రళయం అనేవి ప్రకృతికి, బద్ధాత్మలకు మాత్రమే కలుగుతుందని పెద్దలు అంటారు.

**సృష్టి వివరణం**

భగవంతుని విశేష సంకల్పం వల్ల బ్రహ్మ పృథక్ సిద్ధమై, తచ్ఛరీరమై ఉండే సూక్ష్మావస్థాపన్నమైన ప్రకృతి (అవిభక్తతమస్సు అనే శబ్దం చేత చెప్పబడేది) మళ్లీ విభక్త తమస్సు అనే అవస్థ, అక్షరావస్థ, అవ్యక్తావస్థలలోనికి పరిణమించిన మహత్తత్వం సాత్వికం (సత్త్వగుణోన్మేషాన్ని కలిగినది) , రాజసం (రజోగుణోన్మేషాన్ని కలిగినది) , తామసం (తమో గుణోన్మేషాన్ని కలిగినది) అని మూడు భేదాలతో ఉంటుంది. అటువంటి భేదాలతో కూడిన మహత్తునుండి అటువంటి వేదాలతో కూడిన అహంకారం పుడుతుంది. అందులో సత్త్వగుణోన్మేషాన్ని వైకారికమనే అహంకారానికి, రజోగుణోన్మేషాన్ని కలిగిన తైజసమనే అహంకారం సహాయం కాగా, త్వక్ చక్షు శ్రోత్ర జిహ్వ ఘ్రాణాలనే జ్ఞానేంద్రియాలు ఐదు, వాక్కు పాణి పాద పాయూపస్థలనే కర్మేంద్రియాలు ఐదు, మనసు అనే పదకొండు ఇంద్రియాలు పుడతాయి. తమో గుణోన్మేషాన్ని కలిగిన భూతాది అనే అహంకారానికి తైజస సహాయం కలిగినప్పుడు శబ్దతన్మాత్ర పుడుతుంది. దానివల్ల ఆకాశం, దానివల్ల స్పర్శ తన్మాత్ర, దానివల్ల వాయువు, దాని వల్ల రూపతన్మాత్ర, దానివల్ల తేజస్సు, దానివల్ల రసతన్మాత్ర, దానివల్ల జలం, దానివల్ల గంధతన్మా త్ర, దానివల్ల పృథివి కలుగుతాయి. అందుచేత, ఆకాశంలో ఒక్క శబ్దం మాత్రం, వాయువులో శబ్దం, స్పర్శ, తేజస్సులో శబ్దం, స్పర్శ, రూపాలు, జలంలో శబ్ద స్పర్శ రూప రసాలు, పృథివిలో శబ్దస్పర్శ రూప రస గంధాలు– అనే అద్రవ్యాలు ఉంటాయి.

ఆత్మలలో, ప్రకృతి సంబంధం వీడని బద్ధాత్మలు శరీరాత్మగా పరిణతమైన చతుర్వింశతితత్త్వమయ సమిష్టులలో, విశేషించి ప్రత్యేకంగా, తమ తమ కర్మలకు అనుగుణంగా ప్రవేశించి ఉండి, సర్వాంతర్యామి అయిన భగవంతునిచే అధిష్ఠింపబడి, కర్మ ఫలాలను అనుభవిస్తూ ఉంటారు. ఇంకా, ఇక్కడ చెప్పవలసిన విశేషాలు విస్తర భయం వల్ల వివరించలేదు.

**కాలవివరణం**

కాలం తత్త్వశూన్యమని ఇంతకుముందే చెప్పబడినది. ఇది కూడా అచిత్తులోని ఏకదేశమే. ఇది విభుద్రవ్యం క్షణఘటికాది పదార్థ పర్యంతంగా వ్యవహారం ఈ కాలానికి ఉపాధి వల్ల ఏర్పడింది. అటువంటి క్షణాది వ్యవహార హేతువు అయిన కాలభేదం అంతా విభువే. "అనాదిః భగవాన్ కాలః" అని మొదలైన ప్రమాణాల వల్ల కాలం నిత్యం అని తెలుస్తున్నది. ఇక్కడ "అనాదిః భగవాన్ కాలః" అంటే —అనాది అయిన పరబ్రహ్మమే కాలస్వరూపం— అని అర్థంకదా. అంతకంటే వేరైనా కాలం ఏదీ లేదు— అని అర్థం వస్తుంది కదా— అని అంటే, ఆ విధంగా కాదు. ఇటువంటి సామానాధికరణ్య నిర్దేశం చేయబడిన చోట్ల శరీర శరీరి భావం చెప్పబడుతుంది— అని గ్రహించాలి. "జ్యోతీంషి విష్ణుః" అని మొదలైన ప్రయోగాలలో ఇటువంటి నిర్వాహం చేయబడడం చేత, భగవచ్ఛరీరమైన కాలం అనాది— అని చెప్పడమే తగినది. ఇది లీలా విభూతిలో ప్రకృతి పరిణామానికి సహకారి అవుతుంది. నిత్యవిభూతికి కాలకృతమైన పరిణామం లేదు.

**అద్రవ్యనిరూపణం**

అద్రవ్యాలు అయిన సత్త్వ రజస్తమస్సులు అచిద్రూపమైన ప్రకృతిలోను, నిత్య విభూతిలోనూ కాలంలోనూ ఉంటాయని చెప్పబడింది కదా. సత్త్వం ప్రకాశ లాఘువాలను కలిగిస్తుంది. రజస్సు చలన ఉపష్టంభనాలను కలిగిస్తుంది. తమస్సు గౌరవ —ఆవరణాలను కలిగిస్తుంది. శబ్దం మొదలైనవి ఐదు శబ్దతన్మాత్రలు మొదలుకొని పృథివి వరకు ఉండే 10 విధాలైన ప్రకృతి పరిణామాలలో విశేషించి ఉంటాయి. అంతకు

పూర్వంలో ఉండే ప్రకృతి పరిణామాలలోనూ, ఏకాదశ ఇంద్రియాలలోను ఉండవు. నిత్యవిభూతిలో, కేవల ప్రకాశరూపాలై ఉండే పంచభూతాలలోనూ దివ్యాలై ఉంటాయి. దివ్యాలంటే ప్రకాశ స్వరూపాలు –అని భావం.

సంయోగం ఏ ద్రవ్యంలోనైనా ఉండి, ద్రవ్యాంతర సంబంధంలో ఉపకరిస్తుంది. ఇది నిత్యం కాదు. అందుచేత ఎల్లప్పుడూ సంయోగం ఉండదు. సంయోగం లేకపోవడమే విభాగం, అంతకంటే వేరు కాదు. శక్తి అనేది కూడా సర్వద్రవ్యవృత్తి. ఇది అనేక విధాలుగా ఉంటుంది. ఇదియే భగవంతునిలో అసంఖ్యేయ కళ్యాణ గుణరూపంగా ఉంటుంది. జీవులలో ఆయా అవస్థా బేధాలను బట్టి కల్యాణాకళ్యాణరూపంగా పరిచిన్నంగా ఉంటుంది. ఈ విధంగానే, ఆచిత్తులో కూడా ఆయా పరిణామాదులకు నిర్వాహకమై, ప్రత్యేక భేదాలతో ప్రత్యేక కార్య జనకమై ఉంటుంది.

ఇంతవరకు విశిష్టాద్వైత మతంలోని తత్వక్రమాన్ని సంగ్రహంగా వివరించడం జరిగింది.

ఇక, మరికొన్ని సిద్ధాంత విషయాలు ప్రస్తావింపబడుతున్నాయి.

**అర్థపంచకజ్ఞానం**

వేదాంతాలు అన్నీ, స్మృతీతిహాస పురాణాలు, వాటిని అనుసరించేవారైన మునులు మొదలగు ప్రామాణిక వర్గం అంతా ఈ కనబడే ప్రపంచమే కాకుండా, మనకు గోచరించని, అధికమైన ఒక తత్వం ఉన్నదని, ఈ ప్రపంచం నశించే స్వభావం కలిగినది, దుఃఖమయం కావడం చేత, దీనిని దాటి, అవిరతమైన సుఖమయమైన అవస్థను మనం పొందాలని, అటువంటి దానిని మనం పొందడం కోసం ముందు మనం తెలుసుకోవలసినవి 5 విషయాలు ఉన్నాయని తెలియజేస్తున్నాయి.

అవి ఏవి? అంటే, స్వస్వరూపం, పరస్వరూపం, ఉపాయ స్వరూపం, విరోధిస్వరూపం– అనే ఐదు. ముందు తాను అనగా ఎవడు, ఎటువంటి వాడు, దేనికి

అర్హుడు– అనే విషయాలను తెలిసి కోవాలి. ఇదియే స్వస్వరూప జ్ఞానం. ఆ తరువాత, తన వంటివారే మిగిలినవారు కూడానా! లేక, తనకంటే విలక్షణమైనవారు ఎవరైనా ఉన్నారా? అని విచారించి, శాస్త్రాన్ని బట్టి, తనవంటివారిని అందరిని తరింపజేసి, నిరతిశయమైన ఆనందాన్ని అనుగ్రహించి, తనలో చేర్చుకునే ఈశ్వరుడు ఒకడు ఉన్నాడని తెలుసుకోవాలి. అదే పరస్వరూప జ్ఞానం. అటువంటి ఈశ్వరుని మనం చేరి ఆనందించాలంటే, ఏ సాధనాన్ని ఆచరించాలి? అనేదానిని తెలుసుకోవాలి. ఇదే ఉపాయ స్వరూప జ్ఞానం. అంతేకాక, మనం ఆచరించిన సాధనం వల్ల మనకు కలిగే ఫలితం ఎటువంటిది? అది స్థిరమా? అస్థిరమా? సుఖైకస్థానమా? దుఃఖసంభిన్నమా? అని మొదలైన ఫలస్వరూప విశేషాన్ని తెలుసుకోవాలి. ఇదే పురుషార్ధ స్వరూప జ్ఞానం. దీనినే మోక్ష స్వరూపమని కూడా అంటారు. ఇటువంటి ఫలం కలగడానికి తాను ఆచరించవలసిన ఉపాయాన్ని, తన స్వరూపాన్ని తెలుసుకోవడంలో మధ్య ఏర్పడే విరోధాలు ఏ విధంగా ఉంటాయో, వాటి స్వరూపాన్ని తెలుసుకోవాలి. ఇదే విరోధిస్వరూప జ్ఞానం. ఈ ఐదిటిని తెలిసినవాడే ముముక్షువై, జీవుడు తరించగలడని ఈ సిద్ధాంతం చెబుతున్నది.

**విశిష్టాద్వైత సిద్ధాంత జ్ఞానం కోసం చదువువవలసిన గ్రంథాలు**

ఈ సిద్ధాంతాన్ని చక్కగా తెలుసుకోవాలంటే ఈ క్రింది గ్రంథాలను అధ్యయనం చేయడం మంచిది.

సిద్ధాంత సిద్ధాంజనం, వేదాంత సిద్ధాంత కౌముది, యతీంద్ర మత దీపిక, తత్వత్రయం, అర్ధ పంచకం, తత్వనిరూపణం.

అంతేకాక, సిద్ధాంత జ్ఞానం కూలంకషంగా కలగాలంటే, ఉభయ వేదాంత గ్రంథాలను సదాచార్యులవలన ఉపదేశరూపంగా పొందాలి.

ఈ విధంగా విశిష్టాద్వైత మత సంగ్రహం సంగ్రహంగా ప్రస్తావింపబడింది. కృపతో ఇందలి దోషాలను పెద్దలు తెలియజేస్తే దిద్దుకొనగలను.

స్థితస్య స్ఖలనం నైవ గచ్ఛతః స్ఖలనం భవేత్,
ఇతి సంచింత్య విద్వాంసః స్ఖలనం సహసంతు మే.

లోకే న కోఽపి సర్వజ్ఞః ప్రమాణాధీననిశ్చయః,
తస్మాత్ ప్రాజ్ఞా సాహసంమే కృపయా క్షంతు మర్థథ.

ఇట్లు వైద్య విద్యానిధి ఆయుర్వేద స్థాపక ఆయుర్వేద మహోపాధ్యాయ ఉభయ వేదాంతమహోదధి ఇత్యాది బిరుదాంకితులైన ఉభయ వేదాంత ప్రవర్తక శ్రీమాన్ పండిత శ్రీమత్తిరుమల పల్లేర్లమూడి రామానుజ స్వామివారి కృతులలో ప్రథమ పుష్పము– శ్రీ విశిష్టాద్వైత (రామానుజ) సిద్ధాంత దర్శన సంగ్రహము– సర్వము సంపూర్ణము.
ఓమ్ శాంతిః శాంతిః శాంతిః

## కేనోపనిషత్ అభిప్రాయం

ఈ ఉపనిషత్ సామవేదానికి చెందినది. తలవకారోపనిషత్ అనే పేరు కూడా దీనికి ఉన్నది.

"కేనేషితం పతతి ప్రేషితం మనః, కేన ప్రాణః ప్రథమః ప్రైతి యుక్తః,
కేనేషితాం వాచ మిమాం వదంతి, చకక్షుః శ్రోత్రం క ఇ దేవో యునక్తి" (
మనస్సు ఎవనిచే ప్రేరేపింపబడి, లౌకికవిషయాలో ప్రసరిస్తున్నది? ముఖ్యప్రాణమనేది ఎవనిచే నియమింపబడి సంచరిస్తున్నది? ఎవనిచే ప్రేరేపింపబడి మానవులు వాక్కులను పల్కుతున్నారు? కన్నులను, చెవులను ఏ దేవుడు నియమిస్తున్నాడు?) అని "కేన" అని ప్రశ్నిస్తూ ఆరంభమవుతున్నందున ఈ ఉపనిషత్తుకు కేనోపనిషత్ అనే పేరు కల్గింది.

"యన్మనసా న మనుతే యేనాహుర్మనో మతమ్,
తదేవ బ్రహ్మ త్వం విద్ధి వేదం యదిద ముపాసతే"

(ఏది మనస్సుతో తెలియరానిదో, దేనిని నియమనంతో మనస్సు అన్యవిషయాలను తెలిసికొంటున్నదో, అదే బ్రహ్మమని గ్రహించు. లోకంలోనివారు ఆశపడే అన్యవిషయాల కంటే అది విలక్షణమైనది) ఇత్యాది వాక్యాలద్వారా పూర్వం అడిగిన ప్రశ్నలకు బదులివ్వబడింది. "యస్య మనః శరీరం యో మనోంతరో సంచరన్ యం మనో న వేద" (ఎవనికి మనస్సు శరీరమో, ఎవడు మనస్సులో ఉంటూ సంచరిస్తున్నాడో, ఎవనిని మనస్సు తెలియలేదో) అని ఆరంభమై, "ఏష సర్వభూతాంతరాత్మా అపహతపాప్మా దివ్యో దేవ ఏకో నారాయణః" (ఇతడే అన్ని ప్రాణులకు అంతరాత్మ, దోషం లేనివాడు, పరమపదంలో ఉండేవాడు, అద్వితీయుడైన నారాయణుడు అనే దేవుడు) అని ముగిసే సుబాలోపనిషత్ వాక్యాలతో ఒకే అర్థాన్ని కల్గినది అయినందున ఇదికూడా భగవత్ పరమే అనేది స్పష్టపడుతున్నది. ఇంతేకాక, "నారాయణః పరం బ్రహ్మ" (పరబ్రహ్మ నారాయణుడే) అని చెప్పబడిన బ్రహ్మశబ్దాన్ని పరమాత్మ విషయంగా పలుమార్లు ఈ

ఉపనిషత్తు పఠించినందునకూడా ఇది పరబ్రహ్మమైన నారాయణునే తెల్పుతున్నది- అని స్పష్టపడుతున్నది.

శ్రీమన్నారాయణుని పరత్వాన్ని తెలిపే ఈ ఉపనిషత్తులోని ఉపాఖ్యానం ఒకటి ఇపుడు వివరింపబడుతున్నది. పరబ్రహ్మ అయిన విష్ణువు దేవతలకోసం అసురులను జయించాడు. ఈ జయం తమ సామర్థ్యంవల్ల సిద్ధించింది- అని తలచి దేవతలు గర్వించారు. బ్రహ్మస్వరూపి అయిన భగవానుడు వారి గర్వాన్ని అణచడంకోసం ఒక యక్షరూపాన్ని ధరించి ప్రత్యక్షమయ్యాడు. ఆ యక్షునిగూర్చి తెలిసికొనిరమ్మని దేవతలు అగ్నిని కోరారు. ఆ విధంగానే వచ్చిన అగ్నిని "నీవెవరు? నీ శక్తి ఏమి?" అని ఆ యక్షస్వరూపంలోని భగవానుడు అడిగాడు. "నేను అగ్ని అని, జాతవేదసుడని చెప్పబడేవాడను, లోకంలోని వస్తువులను అన్నిటిని దహించే శక్తిని కలవాడను" అని అన్నాడు, అగ్ని. యక్షుడపుడు ఒక పుల్లను అతని ముందుంచి, "దీనిని దహించు, చూద్దాం" అన్నాడు. తన సహజవేగంతో ఆ పుల్లను భస్మం చేయాలని అగ్ని ప్రయత్నించాడు. ఎంత ప్రయత్నించినా అగ్నికి ఆ పని సాధ్యపడలేదు. తరువాత దేవతల దగ్గరకు అగ్ని తిరిగి వచ్చి, తన అపజయాన్ని తెలిపాడు. దేవతలపుడు వాయువును పంపారు. యక్షునిచే ప్రశ్నింపబడ్డ వాయువు "నేను వాయువును. లోకంలోని వస్తువులను అన్నిటిని కదల్చే శక్తి కలవాడను" అని అన్నాడు. పూర్వంవలె మళ్ళీ యక్షుడు ఒక పుల్లను వాయువు ముందు పెట్టి, "దీనిని కదలించు, చూస్తాను" అని అన్నాడు. తనకు సాధ్యమైనంతవరకు వాయువు ఆ పుల్లను కదిలించాలని చూచాడు. కాని వీలు కాలేదు.

"తేన వినా తృణమపి న చలతి"- అతడు లేకపోతే గడ్డిపోచకూడా కదలదు- అనే సామెత ఇక్కడ అనుసంధేయం. వాయువు యక్షునిగూర్చి తెలియలేక, తిరిగి రావడాన్ని చూచి దేవతలు ఇంద్రుని పంపించారు. ఇంద్రుడు వచ్చేటపుడు అతడు అవమానాన్ని పొందకూడదనే పక్షపాతంతో ఇంద్రానుజుడైన పరమాత్మ అదృశ్యమయ్యాడు. అక్కడే హిమవంతుని పుత్రిక మిక్కిలి అందమైనది అయిన పార్వతి ప్రత్యక్షమైనది. ఆమెను "ఈ యక్షుడెవడు?" అని ఇంద్రుడు అడిగాడు. "సా

బ్రహ్మేతి హోవాచ, బ్రహ్మణో వా ఏతద్విజయే మహీయత్వమితి. తతో హైవ విదాంచకార బ్రహ్మేతి" (ఆ పార్వతి- "అది బ్రహ్మమే. బ్రహ్మంయొక్క ఈ జయంలో అందఱు గొప్పతనాన్ని పొందండి. "- అని అన్నది. దాని తర్వాత దేవతలు ఆ యక్షుడు బ్రహ్మమే అని తెలిసికొన్నారు) అనేవిధంగా జ్ఞానప్రదుడైన శంకరుని పత్ని అయినందున పార్వతీదేవి దేవతలకు బ్రహ్మోపదేశాన్ని చేసింది. బ్రహ్మన్ని సమీపంలో దర్శించిన అగ్ని, వాయువు చాలా గొప్ప దేవతలుగా అయ్యారు- అని ఈ ఉపనిషత్ తెల్పుతున్నది.

# కఠోపనిషత్ కంఠోక్తి

ఈ ఉపనిషత్తు దశోపనిషత్తులలో ముఖ్యమైనది. యజుర్వేదానికి చెందినది. ఇందులో నచికేతస్సుకు, యమునకు మధ్య జరిగిన సంవాదరూపమైన ఉపదేశాలు చెప్పబడ్డాయి. నచికేతస్సు అనే ఋషిపుత్రుడు యమునివద్ద మూడు వరాలు పొందాడు. అందులో మూడవ వరం పరమాత్మ విషయమైనది. అందులోని మూడవ వల్లిలో

"విజ్ఞానసారథి ర్యస్తు మనఃప్రగ్రహవాన్ నరః,
సోధ్వనః పారమాప్నోతి తద్విష్ణోః పరమం పదమ్"

(బుద్ధిని సారథిగాను, మనస్సును పగ్గాలుగాను కల్గినవాడై, ఇంద్రియాలనే గుఱ్ఱాలను పూన్చిన శరీరమనే రథాన్ని ఎవడు నడుపుతున్నాడో, అతడు సంసారమార్గానికి ఆవలి వైపున ఉండే విష్ణువుయొక్క పరమపదాన్ని పొందుతున్నాడు) అని సంసారానికి ఆవలి వైపున ఉండే లోకం విష్ణువునకు చెందినదే- అని సుస్పష్టంగా చెప్పబడింది. ఇంకా పలు వాక్యాలలో ఆ విష్ణువే పరమపురుషుడని, పరమాత్మ అని చెప్పబడ్డాడని తెల్పి, ఆఱవ వల్లిలో

"యః పూర్వం తపసో జాత మద్భ్యః పూర్వమజాయత,
గుహాం ప్రవిశ్య తిష్ఠంతం యో భూతేభి ర్వ్యపశ్యత"

(జలంనుండి పూర్వం ఒకానొక సమయంలో సంకల్పమాత్రంతో జన్మించినవాడు, గుహలో ప్రవేశించినవాడైన హిరణ్యగర్భునకు ఎవడు శరీరేంద్రియాలను ఇచ్చి కటాక్షించాడో, అతడే పరమాత్మ) అని అతడే బ్రహ్మను సృష్టించినవాడని ఉద్ఘోషించింది. "అంగుష్ఠమాత్రః పురుషో మధ్య ఆత్మని తిష్ఠతి" (బొటనవేలు పరిమాణాన్ని కలవాడై, పురుషశబ్దవాచ్యుడైన నారాయణుడు హృదయంలో వేంచేసి ఉన్నాడు) అని, "అంగుష్ఠమాత్రః పురుషోంతరాత్మా సదా జనానామ్ హృదయే సన్నివిష్టః" (బొటనవేలు పరిమాణాన్ని కలిగిన పురుషుడు అంతరాత్మయై, అందరి జనుల హృదయంలో వేంచేసి ఉన్నాడు) అని, "య ఏష సుప్తేషు జాగర్తి కామం కామం పురుషో నిర్మిమాణః తదేవ శుక్రం తద్బ్రహ్మ తదేవామృత ముచ్యతే" (పురుషశబ్దంచేత

చెప్పబడే ఎవడు, అందఱు జీవులు నిద్రిస్తూ ఉండగా మేల్కొని ఉండి, తన సంకల్పంతో పదార్థసృష్టిని చేస్తున్నాడో, ఆ పరమపురుషుడే కాంతిని కలవాడని, బ్రహ్మమని, మోక్షప్రాప్యుడని చెప్పబడుతున్నాడు) అని,

"పురుషాన్న పరం కించిత్ సా కాష్ఠా సా పరా గతిః"

(పురుషుని కంటే గొప్పది లేదు, అతడే గొప్ప ప్రాప్యమై ప్రాపకమై ఉన్నాడు) అని,

"అవ్యక్తాత్తు పరః పురుషో వ్యాపకో-లింగ ఏవ చ,
యద్జ్ఞాత్వా ముచ్యతే జంతు రమృతత్వం చ గచ్ఛతి"

(సర్వవ్యాపి, పొందడానికి దుర్లభుడై ఉండే పురుషుడు జీవునికంటే గొప్పవాడు. అతనిని తెలిసినవాడు ముక్తిని పొందుతున్నాడు) అని నారాయణునకే అసాధారణమైనది, పురుషసూక్తాదులలో చెప్పబడినది అయిన పురుషశబ్దాన్ని పలుమార్లు పఠించినందువల్లకూడా ఈ ఉపనిషత్తు నారాయణునే పరతత్త్వంగా తెల్పుతున్నది- అనేది కరబదరికాన్యాయంలో సుస్పష్టం. "సా కాష్ఠా సా పరా గతిః" అని పల్కడంద్వారా, "నారాయణం పరాయణమ్" అని నారాయణసూక్తంలో, "శరణం గతిర్నారాయణః" అని సుబాలోపనిషత్తులో చెప్పబడిన నారాయణుడే ఇతడు— అని తెల్పింది. ఇంతటితో ఆగకుండా, అయిదవ వల్లిలో "మధ్యే వామన మాసీనం విశ్వే దేవా ఉపాసతే" (హృదయకమలం మధ్యలో వేంచేసి ఉండే వామనుడైన భగవానుని దేవతలందఱు ఉపాసిస్తున్నారు) అని భగవానుడు అభిమానించిన తిరునామాలలోని ఒక నామమైన వామననామాన్ని పఠించింది. ఇంతే కాదు. అయిదవ వల్లిలోని తొమ్మిదవ మంత్రంనుండి ఆరంభించి పన్నెండవ మంత్రంవరకు గల ప్రతిమంత్రంలోను "ఏక స్తథా సర్వభూతాంతరాత్మా" అని పఠించడంద్వారా "ఏష సర్వభూతాంతరాత్మా. ఏకో నారాయణః" అనే సుబాలోపనిషద్వాక్యంలో ఉద్ఘోషింపబడే సర్వాంతర్యామి అయిన నారాయణుడే ఇక్కడకూడా చెప్పబడ్డాడు- అని కరతలామలకంగా చూపింది. ఈ విధంగా మొదటినుండి చివరివరకు పరమపురుషుడైన విష్ణువునే ఈ ఉపనిషత్తు ఉద్ఘోషించినందున ఇదికూడా భగవన్నారాయణపరమే- అనేది శిలాశాసనంగా తేటతెల్లమవుతున్నది.

# ప్రశ్నోపనిషత్తుయొక్క బ్రహ్మోపదేశం

ఈ ఉపనిషత్తు అధర్వణవేదానికి చెందినది. ఇది ప్రశ్నోత్తరరూపంగా ఉన్నందున ప్రశ్నోపనిషత్తు అనబడుతున్నది. మొదటి ప్రశ్నలో పరబ్రహ్మనుగూర్చి ఉపదేశించేటపుడు "విశ్వరూపం హరిణం జాతవేదసమ్ పరాయణం జ్యోతిరేకం తపంతమ్" అని ఉద్ఘోషించింది. ఇందులోని ప్రతిపదం నారాయణునే తెల్పుతున్నది - అనే విషయం ఇపుడు వివరింపబడుతున్నది.

(విశ్వరూపమ్) - లోకాలను అన్నిటిని రూపంగా కలవాడని అర్థం. "విశ్వరూపాయ వై నమః" అని ఉత్తరనారాయణంలో నారాయణునిగూర్చి విశ్వరూపశబ్దం ప్రయోగింపబడడాన్ని ఇది స్మరింపజేస్తుంది. "విశ్వాత్మానమ్" అని,
"యచ్చ కించిత్ జగత్యస్మిన్ దృశ్యతే శ్రూయతే పి వా,
అంతర్బహిశ్చ తత్ సర్వం వ్యాప్య నారాయణః స్థితః"
అని నారాయణుడు అన్నిటికి ఆత్మయై ఉండడాన్ని, సకలవస్తువులు ఇతనికి శరీరమై ఉండడాన్ని ఉత్తరనారాయణం తెల్పిందికదా.

(హరిణమ్) - "హరి" అనే సాధారణ నామాన్ని కలవాడు. ఈ పదం ణకారాంతమై ఉండడం ఛాందసప్రయోగం. "విశ్వం నారాయణం హరిమ్" అని నారాయణసూక్తంలోని ప్రయోగాన్ని ఇది స్మరింపజేస్తుంది. ఈ తిరునామానికి "బ్రహ్మరుద్రేంద్రాదులను సంహరించేవాడు"అని, "ఆశ్రితుల పాపాలను పోగొట్టేవాడు" అని, "దర్శించినవారి మనస్సులను అన్నిటిని తనలో అభినివిష్టమయేటట్లు చేసేవాడని"- ఈ విధంగా ఇంకా పలు అర్థాలున్నాయి.

"బ్రహ్మాణమింద్రం రుద్రం చ యమం వరుణమేవ చ,
ప్రసహ్య హరతే యస్మాత్ తస్మాత్ హరిరిహోచ్యతే" (బ్రహ్మ, రుద్రుడు, ఇంద్రుడు, యముడు, వరుణుడు మొదలైనవారిని బలాత్కారంగా సంహరించేవాడు కనుక హరి అనబడుతున్నాడు) అని,

"హరిర్హరతి పాపాని దుష్టచిత్తై రపి స్మృతః,
అనిచ్ఛయాపి సంస్పృష్టో దహత్యేవ హి పావకః"

(దుష్టమైన మనస్సులను కలవారిచే స్మరింపబడినప్పటికీ, హరి పాపాలను పోగొడతాడు. ఇష్టం లేకుండా తాకినా, నిప్పు కాలకుండా ఉండదుకదా) అని చెప్పబడింది కదా!

(జాతవేదసమ్) - వేదాలకు జన్మస్థానమైనవాడు - అని అర్థం.

"యో బ్రహ్మాణం విదధాతి పూర్వం యో వై వేదాంశ్చ ప్రహిణోతి తస్మై"

(పూర్వం ఎవడు బ్రహ్మను సృష్టించాడో, ఆ బ్రహ్మకు వేదాలను అనుగ్రహించాడో) అనే వాక్యాన్ని స్మరించాలి. నారాయణుడే బ్రహ్మను సృష్టించి, అతనికి వేదాలను ఉపదేశించాడు) అనేది సకలప్రమాణసిద్ధం.

(పరాయణమ్) - గొప్ప ప్రాప్యమై, ప్రాపకమై ఉండేవాడు. "నారాయణం మహాజ్ఞేయం విశ్వాత్మానం పరాయణమ్" అనే నారాయణసూక్తవాక్యంలో చెప్పబడిన నారాయణుడే ఇక్కడ చెప్పబడుతున్నాడు- అని అనడంలో ఏమి సందేహమున్నది?

(జ్యోతిరేకమ్) - సాటి లేని జ్యోతిస్స్వరూపుడై ఉండేవాడు- అని అర్థం. ఇది "నారాయణపరో జ్యోతిః" అనే నారాయణసూక్త శ్రుతిని స్మరింపజేస్తున్నది.

(ఏకమ్) - సాటి లేనివాడు. "పరమం ప్రభుమ్ నారాయణమ్" అనే నారాయణానువాకంలోను, "దివ్యో దేవ ఏకో నారాయణః" అని సుబాలోపనిషత్తులోను చెప్పబడినవాడని దీనిద్వారా తెలుపబడుతున్నది. "సదేవ సౌమ్యేదమగ్ర ఆసీత్, ఏకమేవాద్వితీయమ్" అని, "ఏకో హ వై నారాయణ ఆసీత్, న బ్రహ్మా నేశానః" అని కారణవాక్యాలలో చెప్పబడిన జగత్కారణభూతుడనికూడా ఉద్ఘోషింపబడుతున్నది.

(తపంతమ్) -

"తస్య మధ్యే మహానగ్ని ర్విశార్చి ర్విశ్వతో ముఖః,
సంతాపయతి స్వం దేహ మాపాదతలమస్తకమ్"

(ఆ హృదయం మధ్యభాగంలో దేహమంతా వ్యాపించినది, అంతటా జ్వాలలను కల్గినది అయిన గొప్ప జఠరాగ్ని ఉన్నది. అది దేహంలో మస్తకంనుండి పాదాలవరకు తపింపజేస్తున్నది) అని నారాయణసూక్తంలో,

"అహం వైశ్వానరో భూత్వా ప్రాణినాం దేహమాశ్రితః,
ప్రాణాపానసమాయుక్తః పచామ్యన్నం చతుర్విధమ్"

(ప్రాణులదేహాన్ని ఆశ్రయించి ఉండే వైశ్వానరాగ్నినై, ప్రాణం, అపానం మొదలైన వాయువులలోకూడి నాల్గు విధాలైన అన్నాలను నేను జీర్ణింపజేస్తాను) అని గీతలో పల్కినట్లుగా జఠరాగ్నిని శరీరంగా కల్గి తపింపజేసేవాడు. దీనివల్ల ఈ మంత్రం నారాయణసూక్తప్రతిపాద్యుడైన నారాయణునే తెల్పుతున్నది- అని తెలుస్తున్నది.

(తపంతమ్) -

"న తత్ర సూర్యోభాతి న చంద్ర తారకమ్,
నేమా విద్యుతో భాంతి కుతోయ మగ్నిః,
తమేవ భాంత మనుభాతి సర్వం
తస్య భాసా సర్వమిదం విభాతి"

(ఆ పరమపురుషుని ముందు సూర్యుడు కాని, చంద్రుడుకాని, తారకలు గాని, విద్యుత్తు కాని ప్రకాశించ లేవు. ఇక, అగ్నినిగూర్చి చెప్పవలసినది ఏమున్నది? ప్రకాశించే అతనిని అనుసరించే అన్ని వస్తువులు ప్రకాశిస్తున్నాయి. అతని కాంతిచేతనే ఇది ప్రకాశిస్తున్నది) అని కఠోపనిషత్తులో ఘోషింపబడినట్లు సూర్యుడు మొదలైన తేజోద్రవ్యాల కంటే మిక్కిలి ఎక్కువగా ప్రకాశించేవాడు- అనే అర్థాన్ని చెప్పవచ్చు.

(తపంతమ్) - "ఆదిత్యవర్ణమ్" అని, "నీలతోయదమధ్యస్థా విద్యుల్లేఖేవ భాస్వరా" అని, "పురుషకృష్ణపింగళమ్" అని పురుషసూక్త- నారాయణానువాకాలలో చెప్పబడిన దివ్యమంగళవిగ్రహంతో ప్రకాశించేవాడు- అనే అర్థాన్ని చెప్పవచ్చు. ఈ విధంగా ప్రశ్నోపనిషత్తు ఆరంభంలో ఉండే ఈ మంత్రం పురుషసూక్త, నారాయణానువాక, సుబాలోపనిషత్తు మొదలైనవానిలో చెప్పబడిన నారాయణుడే ఈ ఉపనిషత్తుకుకూడా విషయమై ఉన్నాడు- అని నిర్ణయిస్తున్నది.

**నాల్గవ ప్రశ్నలో-**

''స యథా సోమ్య వయాంసి వాసో వృక్షం సంప్రతిష్ఠంతే,

ఏవం హ వై తత్ సర్వం పర ఆత్మని సంప్రతిష్ఠంతే''

(కుఱ్ఱవాడా! పకక్షులు తాము నివసించే వృక్షాన్ని ఏ విధంగా ఆశ్రయించి ఉంటాయో, ఆ విధంగానే అన్ని వస్తువులు పరమాత్మలో నిలచి ఉంటాయి) అని ''ఆత్మా నారాయణః పరః'' అని అనబడే నారాయణుడే సర్వాశ్రయభూతుడనే విషయాన్ని తెల్పింది.

''పృథివీ చ పృథివీమాత్రా చ, ఆప చ్చాపోమాత్రా చ, తేజశ్చ తేజోమాత్రా చ, వాయుశ్చ వాయుమాత్రా చ, ఆకాశ శ్చాకాశమాత్రా చ, చక్షుశ్చ ద్రష్టవ్యం చ శ్రోత్రం చ శ్రోతవ్యం చ, ఘ్రాణం చ ఘ్రాతవ్యం -చ, రసశ్చ రసయితవ్యం చ, త్వక్చ స్పర్శయితవ్యం చ, వాక్చ వక్తవ్యం చ, హస్తౌ చ ఆదాతవ్యం చ, ఉపస్థం చ ఆనందయితవ్యం చ, పాయుశ్చ విసర్జయితవ్యం చ, పాదౌ గంతవ్యం చ, మనశ్చ మంతవ్యంచ, బుద్ధిశ్చ బోద్ధవ్యం చ, అహంకారశ్చ అహం కర్తవ్యం చ, చిత్తం చ చేతయితవ్యంచ, తేజశ్చ విద్యోదతయితవ్యం చ, ప్రాణశ్చ విధారితవ్యం చ, ఏష హిద్రష్టా స్ప్రష్టా శ్రోతా ఘ్రాతా రసయితా మంతా బోద్ధా కర్తా విజ్ఞానాత్మా పురుషః పరే ఆత్మని సంప్రతిష్ఠతే'' (పృథివి, గంధతన్మాత్ర, జలం, రసతన్మాత్ర, అగ్ని, రూపతన్మాత్ర, వాయువు, స్పర్శతన్మాత్ర, ఆకాశం, శబ్దతన్మాత్ర, కళ్ళు చూచేవి చెవులు, వినేవి, ముక్కు, వాసనచూచేవి, జిహ్వా, రుచి చూచేవి, చర్మం, స్పృశించేవి, వాయువు, చలించేవి, చేయి, గ్రహించేవి, (స్త్రీ, పురుష) చిహ్నం, (దీనివల్లకలిగే) భోగాలు, విసర్జనేంద్రియం, దానివల్ల విసర్జింపబడేవి, పాదాలు, వెళ్ళే చోట్లు, మనస్సు భావింపబడేవి, బుద్ధి తెలియబడేవి, అహంకారం, అహంకరింపబడేవి, చిత్తం, చింతింపబడేవి, కాంతి, ప్రకాశించేవి, ప్రాణం, ధరింపబడేవి- (అనే అన్ని అచేతన

తత్త్వాలు) చూచేవాడు, స్పృశించేవాడు, వినేవాడు, వాసన చూచేవాడు, రుచి చూచేవాడు, భావించేవాడు, వినేవాడు, వాసన చూచేవాడు, రుచి చూచేవాడు, భావించేవాడు, తెలిసేవాడు, చేసేవాడు (అనే) జ్ఞానస్వరూపి అయిన చేతనతత్త్వం- అన్నీ నాశంలేని పరమాత్మవద్ద స్థిరంగా నిలచి ఉన్నాయి) అని పఠించింది. ఈ వాక్యంలో చెప్పబడినవాడు నారాయణుడే అనేవిషయాన్ని.

"చక్షుశ్చ ద్రష్టవ్యం చ నారాయణః, శ్రోత్రం చ శ్రోతవ్యం చ నారాయణః,
ఘ్రాణం చ ఘ్రాతవ్యం చ నారాయణః, జిహ్వాచ రసయితవ్యం చ నారాయణః,
త్వక్చ స్పర్శయితవ్యం చ నారాయణః, మనశ్చ మంతవ్యం చ నారాయణః,
బుద్ధిశ్చ బోద్ధవ్యం చ నారాయణః, అహంకారశ్చ అహంకర్తవ్యం చ నారాయః,
చిత్తం చ చేతయితవ్యంచ నారాయణః,
వాక్చ, వక్తవ్యం చ నారాయణః, హస్తౌ చ దాతవ్యం చ నారాయణః,
పాదౌ చ గంతవ్యం చ నారాయణః, పాయుశ్చ విసర్జయితవ్యం చ నారాయణః, ఉపస్థశ్చ ఆనందయితవ్యం చ నారాయణః, ధాతా విధాతా కర్తా వికర్తా దివ్యో దేవ ఏక ఏవ నారాయణః" (కళ్ళు, చూచేవి నారాయణాధీనమే చెవులు, వినేవి నారాయణధీనమే, ముక్కు, వాసన చూచేవి నారాయణధీనమే, జిహ్వ, రుచి చూచేవి నారాయణాధీనమే, చర్మం, స్పృశించేవి నారాయణాధీనమే, మనస్సు, భావించేవి నారాయణాధీనమే, జ్ఞానం, తెలియబడేవి నారాయణాధీనమే, అహంకారం, అహంకరింపబడేవి నారాయణాధీనమే, చిత్తం, చితింపబడేవి నారాయణాధీనమే, చేతులు, ఇవ్వబడేవి నారాయణాధీనమే, పాదాలు, వెళ్ళే స్థలాలు నారాయణాధీనమే, విసర్జనీయేంద్రియం, విసర్జించేవి నారాయణాధీనమే, స్త్రీపురుషచిహ్నాలు, భోగాలు నారాయణాధీనమే, ధరించేవాడు, సృష్టించేవాడు, చేసేవాడు, వికారాన్ని పొందేవాడు, పరమపదనిలయుడైన దేవుడు నారాయణుడొక్కడే) అని సుబాలోపనిషత్తు స్పష్టంగా పల్కింది. ఈ ప్రశ్నోపనిషత్తు నారాయణునే తెల్పుతున్నది- అని అనడానికి ఇంత కంటే వేఱేమి ఆధారం కావాలి? ఈ మాటను "అథ నిత్యో నారాయణః, బ్రహ్మా నారాయణః,

శివశ్చ నారాయణః, శక్రశ్చ నారాయణః, కాలశ్చ నారాయణః, దిశశ్చ నారాయణః, విదిశ శ్చ నారాయణః, ఊర్ధ్వం చ నారాయణః, అధశ్చ నారాయణః, అంతర్బహిశ్చ నారాయణః, నారాయణ ఏవేదం సర్వం, యత్ భూతం యచ్చ భవ్యమ్". (పరమపదంలోని నిత్యసూరులు నారాయణాధీనులే, బ్రహ్మకూడా నారాయణునకు అధీనుడే, శివుడు నారాయణుని అంతర్యామిగా కలవాడు, ఇంద్రుడు నారాయణాత్మకుడే కాలం నారాయణాధీనమే, దిక్కులు నారాయణాధీనాలే. విదిక్కులుతకూడా నారాయణాధీనాలే. ఊర్ధ్వభాగం నారాయణాధీనమే. అధోభాగం నారాయణాధీనమే, లోపల బయట అంతా నారాయణాధీనమే, గడచినది, రాబోయేది వర్తమానం అంతా నారాయణుని అంతర్యామిగా కల్గినదే) అని నారాయణోపనిషత్తుకూడా పల్కింది.

"యచ్చ కించిత్ జగత్యస్మిన్ దృశ్యతే శ్రూయతేపి వా,
అంతర్బహిశ్చ తత్ సర్వం వ్యాప్య నారాయణః స్థితః"

(ఈ లోకంలో కన్పించేవి, విన్పించేవి అన్నిటి లోపల బయట నారాయణుడే వ్యాపించి ఉన్నాడు) అని నారాయణానువాకం ఉద్ఘోషించింది.

**ఈ ప్రశ్నోపనిషత్తులోని పంచమ ప్రశ్నలో-**

"యః పునరేతం త్రిమాత్రేణైవ ఓమిత్యేతేనైవ అక్షరేణ పరమం పురుష మభిధ్యాయీత, స తేజసి సూర్యే సంపన్నః, యథా పాదోదర స్త్వచా వినిర్ముచ్యతే ఏవం హ వై స పాప్మనా వినిర్ముక్తః స సామభి రున్నీయతే బ్రహ్మలోకమ్. స ఏతస్మాత్ జీవఘనాత్ పరాత్పరం పురిశయం పురుష మీక్షతే" (మూడు మాత్రలను కల 'ఓమ్' అనే ఈ ప్రణవాక్షరంతో, ఎవడు పరమపురుషుని ఉపాసిస్తున్నాడో, అతడు తేజోమయుడైన సూర్యుని దాటి, సర్పం కుబుసంనుండి విడివడేటట్లు, పాపాలనుండి విడుదలను పొంది, సామగానం చేసే పురుషులచే బ్రహ్మలోకానికి తీసికొనిపోబడతాడు. అతడు ఈ సంసారమండలం కంటే గొప్పదైన శుద్ధాత్మస్వరూపం కంటే గొప్పవాడు,

శ్రీవైకుంఠంలో నివసించేవాడైన పురుషుని తెల్పుతున్నది) - అనే విషయం వివరింపబడుతున్నది.

"ద్వావిమౌ పురుషే లోకే క్షర శ్చాక్షర ఏవ చ,
క్షరః సర్వాణి భూతాని కూటస్థోక్షర ఉచ్యతే,
ఉత్తమః పురుష స్త్వన్యః పరమాత్మేత్యుదాహృతః,
యో లోకత్రయ మావిశ్య బిభర్త్యవ్యయ ఈశ్వరః,
యస్మాత్ క్షరమతీతోహ మక్షరాదపి చోత్తమః,
తస్మాత్ వేదే చ లోకే చ ప్రథితః పురుషోత్తమః"

(క్షరుడని, అక్షరుడని లోకంలోని పురుషులు రెండు విధాలు. చేతనులందఱు క్షరపురుషులు. కూటస్థుడైన ముక్తాత్మ అక్షరపురుషుడనబడుతున్నాడు. ఎవడు ముల్లోకాలలో ప్రవేశించి, వానిని ధరిస్తున్నాడో, ఏ కొఱత లేనివాడుగా, నియమించేవాడుగా, పరమాత్మ అని చెప్పబడేవాడుగా ప్రకాశిస్తున్నాడో, ఆ పరమపురుషుని (పూర్వం చెప్పబడిన పురుషుల కంటే విలక్షణుడు.) నేను జ్ఞానంతో హెచ్చు తగ్గులున్న క్షరపురుషుని అతిక్రమించినందున, జ్ఞానంలో తారతమ్యాలు లేని ముక్తపురుషుని కంటే గొప్పవాడనైనందున, వేదంలో, స్మృతులలో పురుషోత్తముడననే ప్రసిద్ధిని పొందాను) అని గీతలో సర్వేశ్వరుడే వచించాడు కదా! "పురుషోత్తమః కః" (ఎవడు పురుషోత్తము డనబడుతున్నాడు?) అని భగవద్యామునులుకూడా అన్నారు. శివభక్తుడైన కాళిదాసుకూడా "హరిర్యథైకః పురుషోత్తమః స్మృతః" (ఏ విధంగా హరి ఒక్కడే పురుషోత్తముడనబడుతున్నాడో.) అని అన్నాడు.

(యః పునరేతం. పరం పురుషమభివీక్షతే) - "మూన్టెఎ(ళుత్తదనై మూన్టె ఎ(ళు త్తదనాల్ మూన్టెఎ(ళుత్తాక్కి మూన్ట, (ళుత్తై ఎన్టుకొణ్డిరుప్పార్క్కు ఇరక్కమ్ నన్గుడైయ ఎమ్ పురుడోత్తమన్" అని పెరియాళ్వార్లు ఈ మంత్రార్థాన్ని తెలిపారు. మూడు అక్షరాలను కల -మూడు మాత్రలను కల- ప్రణవాన్ని మూడు అక్షరాలుగా- నిరుక్తమనే ప్రక్రియలో, అకార- ఉకార- మకారాలనే మూడు అక్షరాలుగా -చేసి, ఆ మూడు

అక్షరాలను కల ప్రణవాన్ని అనుసంధించేవారికి అనుగ్రహించే పురుషోత్తముడు) - అనే ఈ పాశురంయొక్క అర్థం ఈ శ్రుత్యర్థాన్ని ఇంచు మించుగా పోలి ఉండడం గమనార్హం.

(ఓమిత్యేతేనైవ అక్షరేణ పరం పురుషమ్) - నారాయణవల్లిలో "యద్వేదాదౌ స్వరః ప్రోక్తో వేదాంతే చ ప్రతిష్ఠితః, తస్య ప్రకృతిలీనస్య యః పరః స మహేశ్వరః" (వేదం ఆరంభంలోను, చివరలోను ఏ స్వరం ఉచ్చరింపబడుతున్నదో, తనకు కారణమైన అకారంలో లీనమయే ఆ ఓంకారానికి ఎవడు అర్థమో, అతడే మహేశ్వరుడు) అని పల్కి, తర్వాత "సహస్రశీర్షం దేవమ్" అని ఆరంభించి ఆ సర్వేశ్వరుడు నారాయణుడే అని నిర్ణయించింది. అతడే ఇక్కడ పరమపురుషుడని చెప్పబడుతున్నాడు. అథర్వశిఖలో కూడా "ప్రథమా రక్తపీతా మహద్బ్రహ్మదైవత్యా, ద్వితీయా విద్యుమతీ కృష్ణా విష్ణుదైవత్యా, తృతీయా శుభ్రా శుక్లా రుద్రదైవత్యా, యావసానేస్య చతుర్థ్యర్థమాత్రా విద్యుమతీ సర్వవర్ణా పురుషదైవత్యా" (ఎఱుపు, పసుపు పచ్చ కలిసిన వర్ణాన్ని కల ప్రణవంయొక్క మొదటి మాత్ర—పెద్దవాడైన బ్రహ్మను అధిదేవతగా కల్గినది. కాంతిని కల్గినది, నల్లని వర్ణాన్ని కల్గినది అయిన రెండవ మాత్ర— విష్ణువును దేవతగా కల్గినది. శుభమైనది, తెల్లని వర్ణాన్ని కల్గినది అయిన మూడవ మాత్ర— రుద్రుని దేవతగా కల్గినది. చివరలో గల, నాల్గవది అయిన అర్థమాత్ర —పురుషుని దేవతగా కల్గినది) అని పూర్ణమైన ప్రణవానికి దేవత పురుషోత్తముడే అని పఠింపబడింది. ఇక్కడ చెప్పబడిన విష్ణుశబ్దం పరమపురుషుడైన నారాయణుని అవతారమూర్తి అయిన విష్ణువును తెల్పుతుంది. గీతలో భగవానుడు కూడా "ఓమిత్యేకాక్షరం బ్రహ్మ వ్యాహరన్ మా మనుస్మరన్, యః ప్రయాతి త్యజన్ దేహం స యాతి పరమాం గతిమ్" (వేదాలను తనలో కల్గినది, ఏకాక్షరమై ఉండేది, అయిన "ఓమ్" అనే అక్షరాన్ని ఉచ్చరిస్తూ, దానికి అర్థమైన నన్ను భావిస్తూ ఎవడు శరీరాన్ని విడుస్తాడో, అతడు ఉత్తమగతిని పొందుతాడు) అని చెప్పబడింది. హరివంశంలో రుద్రుడుకూడా "ఓమిత్యేవం సదా విప్రాః పఠత్వం ధ్యాత కేశవమ్" (బ్రాహ్మణులారా! ఓమ్ అనే అక్షరాన్నే సదా పఠించండి. దానికి అర్థమైన కేశవుని ధ్యానించండి) అని చెప్పాడు. "స్వదేహ మరణిం కృత్వా ప్రణవం చోత్తరారణిమ్, ధ్యాననిర్మథనాభ్యాసాత్ విష్ణుం పశ్యేత్ హృది స్థితమ్" (తన దేహాన్ని

కింద పెట్టి, అరణిని కాష్ఠంగాను, ప్రణవాన్ని పైన పెట్టి అరణి కాష్ఠంగాను చేసికొని ధ్యానమనే ధనాన్ని పలు మార్లు చేస్తే హృదయంలో ఉండే విష్ణువు అనే జ్యోతిని దర్శించవచ్చు) అని యోగయాజ్ఞ్యవల్క్యంలోకూడా చెప్పబడింది. "క్లేశకర్మవిపాకాశయైః అపరామృష్టః పురుషవిశేష ఈశ్వరః, తస్య వాచకః ప్రణవః" (దుఃఖం, కర్మఫలం, వాసన- అనే వీని సంబంధం లేని పురుషుడు ఈశ్వరుడు. అతనిని తెలిపే పదం ప్రణవం) అని పాతంజల యోగసూత్రంలోను (1-14-15) చెప్పబడింది. పరమపురుషుడనే నారాయణుడే ప్రణవవాచ్యుడనే దానికి ఇంకా పలు ప్రమాణాలున్నాయి. అవి విస్తరభీతిచేత ప్రస్తావింపబడలేదు.

(స తేజసి సూర్యే సంపన్నః) - ఈ విధంగా ప్రణవంలో పరమపురుషుని ధ్యానించేవాడు సూర్యమండలానికి వెడతాడు. "కారార్ పురవియే ఏళ్ పూణ్డ తనియాళి తేరార్ నిఱై కదిరోన్ మణ్డలత్తై క్కీణ్డు పుక్కు, ఆరావముద మఙ్గెయ్ది, అదినిన్ఱుమ్ వారాదొళివదొన్ఱుణ్డే" అని తిరుమంగై ఆళ్వార్లు ఈ విషయాన్ని పలికారు. ఈ విషయంలో పలు ప్రమాణాలను శ్రీభాష్యాది గ్రంథాలలో గమనించవచ్చు.

(యత్ర పరమోదారః. వినిర్ముక్తః) - సర్పం కుబుసాన్ని విడచినట్లు పాపాన్ని ఈ జీవుడు విడచిపెడుతున్నాడు. "సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ, అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః" (ధర్మాలను సవాసనాగా విడచిపెట్టి, నన్ను ఒక్కని మాత్రమే శరణు పొందు. నేను నిన్ను అన్ని పాపాలనుండి విముక్తుని చేస్తాను) అనే నారాయణుని తప్ప వేఱు ఎవరు ఈ పాపవిమోచనాన్ని ఐ. చేయగలరు? "యథా ఇషీకతూల మగ్నౌ ప్రోతం ప్రదూయేత, ఏవం హాస్య సర్వే పాప్మానః ప్రదూయంతే" (నిప్పులో వేసిన రెల్లుముక్క దహింపబడేటట్లు, ఇతని పాపాలు అన్నీ దహింపబడతాయి) అని వేదంలోను, "పోయ పిఎళైయుమ్ పుకుదరువాన్ నిన్ఱనవుమ్ తీయినిల్ తూశాకుమ్" గోదాదేవి చేత, "నమ్మన్పోల వీళ్ త్తముక్కుమ్ నాట్టిలుళ్ళపావమెల్లామ్ శుమ్మెనాదే కైవిట్టోడి త్తూఱుకళ్ పాయ్న్దనవే" అని పెరియాళ్వార్లచేత ఈ విషయం చెప్పబడింది.

(స సామభి రున్నీయతే బ్రహ్మలోకమ్) - "హావు హావు హావు" అని సామగానం చేసే ఆతివాహికులైన నిత్యసూరులచే పరబ్రహ్మలోకమైన శ్రీవైకుంఠానికి తీసికొనిపోబడతాడు. 'ససామభిః" అనే పదానికి "సామగానం చేసేవారు" అని, "మంచి వార్తలను పలికేవారు" అని శ్రుతప్రకాశికాచార్యులవారు ఈక్షతికర్మాధికరణంలో అర్థాన్ని తెలిపారు. "ఎళుమిన్ ఎన్టు ఇరుమరుఙ్గు ఇశైత్తనర్ మునివర్కళ్ వళియిదు వైకున్దత్తుక్కెన్టు వన్దెదిరే" అని, "కుడియడియారివర్ కోవిన్దన్ తనక్కెన్టు ముడియుడై వానవర్ ముఱై ముఱై ఎదిర్ కొళ్ళ" అని ముక్తపురుషులందఱు మంచి మాటలను పల్కుతూ స్వాగతం పల్కుతారని ఆళ్వార్లు వివరించారు.

(ఏతస్మాత్ జీవఘనాత్ పరాత్పరం పురి శయం పురుషమీక్షతే) - ఈ ముక్తపురుషుడు సంసారి కంటే, గొప్పవాడైన ముక్తపురుషుని కంటే ఉన్నతుడు, "దేవానాం పూ రయోధ్యా" అనబడే బ్రహ్మపురమైన పరమపదంలో శయనించి ఉండేవాడైన పరమపురుషుని దర్శిస్తాడు. "పురి శయం పురుషమ్" అనేదానికి హృదయకమల వాసి అయిన పురుషుని -అనే అర్థాన్ని కూడా తెల్పుతారు. ఇక్కడ చెప్పబడేవాడు నారాయణుడే అనే విషయాన్ని తెలుపబడంకోసం మళ్ళీ పురుషశబ్దాన్ని వేదం పఠించింది.

తరువాత, అయిదవ ప్రశ్నలో కూడా పరమపురుషుని విషయంగా పురుషశబ్దాన్ని పలుమార్లు ప్రశ్నోపనిషత్ పఠించింది.

"స యథేమా నద్యః స్యందమానాః సముద్రాయణాః సముద్రం ప్రాప్య ఆస్తం గచ్ఛంతి భిద్యేతే తాసాం నామరూపే సముద్ర ఇత్యేవం ప్రోచ్యతే, ఏవమేవాస్య పరిద్రష్టుః ఇమాః షోడశకలాః పురుషాయణాః పురుషం ప్రాప్య అస్తం గచ్ఛంతి. భిద్యేతే తాసాం నామరూపే పురుష ఇత్యేవం ప్రోచ్యతే. స ఏషో అకలో అమృతో భవతి. తదేష శ్లోకః. అరా ఇవ రథనాభౌ కలా యస్మిన్ ప్రతిష్ఠితాః, తం వేద్యం పురుషం వేద మావో మృత్యుం పరివ్యథా ఇతి. తాన్ హోవాచ ఏతావదేవాహమే తత్ పరం బ్రహ్మ వేద నాతః పరమస్తీతి" (సముద్రం వైపు ప్రవహించే నదులు, ఆ సముద్రాన్ని చేరగానే అదృశ్యమవుతున్నాయి. వాటి నామరూపాలు నశిస్తున్నాయి. అవి కూడా

సముద్రమనే చెప్పబడుతున్నాయి. ఆ విధంగానే భోక్త అయిన ఈ జీవునకు భోగోపకరణాలై ఉండేవి, పురుషునే ధారకునిగా కల్గినవి అయిన ప్రాణం మొదలైన ఈ పదహారు కళలు పురుషుని చేరగానే అదృశ్యమవుతున్నాయి. వాటి నామరూపాలు నశిస్తున్నాయి. పురుషుడనే చెప్పబడుతున్నాయి. ఆ పరమపురుషుడైతే ప్రాణం మొదలైన కళలను లేనివాడై, మరణం లేనివాడై ఉన్నాడు) . అతనిని గూర్చి ఈక్రింది శ్లోకం పఠింపబడుతున్నది. రథచక్రం మధ్యదేశంలో అరాలు (ఆకులు) ప్రతిష్ఠింపబడినట్లే, ప్రాణాదికళలు ఏ పరమపురుషునిలో ప్రతిష్ఠింపబడ్డాయో, తెలియదగినవాడైన ఆ పురుషుని తెలిసిన మీకు సంసారం తాపాన్ని కల్గించదు. ఆ శిష్యులనుగూర్చి ఆచార్యులు- "ఈ పరబ్రహ్మనుగూర్చి నేను ఏతావన్మాత్రమే తెలిసికొన్నాను. దీనికి మించి తెలియను- అని అన్నాడు) అని నాల్గు పర్యాయాలు పురుషశబ్దాన్ని పఠించి అతడే పరబ్రహ్మమని పల్కింది. ఈ కారణాలనుబట్టి ఈ ఉపనిషత్తు పరమపురుషుడు, హరి అనే తిరునామాలను కలవాడు, ఓంకార వాచ్యుడైన నారాయణునే ప్రతిపాదిస్తున్నది–. అనేది అప్రకంప్యంగా ఏర్పడుతున్నది.



భూవరాహ స్వామి, తిరువిడవిడంధై

## ఈ ముగ్గురిలో ఒకరం మనం ఎవరూ కావద్దు

శ్రీకృష్ణుడు భగవద్గీతలోని నాల్గవ అధ్యాయంలో 40వ శ్లోకంలో మూడు విధాలైన వ్యక్తులను గురించి ప్రస్తావించాడు. ఈ శ్లోకాన్ని వినగానే మనకు "ఈ ముగ్గురిలో ఎవరు మనం కాము కదా! కాకూడదు కదా! " అనే భావం వెంటనే తోస్తుంది. వారు ముగ్గురు ఎవరు? అంటే, " ఆజ్ఞశ్చ అశ్రద్ధధానశ్చ సంశయాత్మా" అనేవారు వీరు ముగ్గురు. వీరిని గురించి శ్రీకృష్ణుడు పలుకుతూ, "నాయం లోకో ౽ స్తి న పరో న సుఖం సంశయాత్మనః" అని అన్నాడు. ఈ విధంగా చెప్పబడిన ముగ్గురికి ఈ లోకం లేదు, ఈ లోకమే లేదంటే, ఇక పై లోకం అనేది లేనేలేదు, వీరికి సుఖం కూడా లేదు – అని అంటాడు.

మరి ఈ ముగ్గురు ఎవరు? ఎటువంటివారు? అనే విచికిత్స మనకు వెంటనే కలుగుతుంది. వీరిలో మొదటివాడు అజ్ఞుడు, అంటే జ్ఞానం లేనివాడు, ఆత్మను గూర్చిన జ్ఞానాన్ని, పరమాత్మను గూర్చిన జ్ఞానాన్ని ఏమాత్రం లేనివాడు. ఇటువంటివానికి సుఖం లేదు.

మనకు వెంటనే ఈ విధంగా తోచవచ్చు. తెలియకపోవడం అనేది ఒక పెద్ద దోషమా? లోకంలో ఎంతమందికో ఎన్నో విషయాలు తెలియవు. తెలియకపోవడం అంత అపరాధం ఏమీ కాదుకదా–అని. నిజమే, తెలియకపోవడం తప్పు కాదు, కానీ, తెలియలేదు అని తెలిసిన తర్వాత అయినా తెలుసుకోవచ్చు కదా. తెలుసుకోవాలి కదా. తెలుసుకోవాలి అనే ఆశ, ప్రయత్నం, అభినివేశం ఉండాలి కదా. అయ్యో! ఇంత కాలం మనకు తెలియకుండా పోయిందే! అనే కొంచెం అయినా మనసులో బాధ, తెలిసికోవాలి అనే ఆశ, శ్రద్ధ ఉండాలి. అయితే, శ్రీకృష్ణుడు చెప్పిన రెండవవానికి ఇవి కూడా ఉండవు. ఇంతకాలం తెలియలేదే! అనే బాధ ఉండదు. ఇకమీదటైనా తెలుసుకోవాలని అనే శ్రద్ధ ఉండదు. ఇతనిని "అశ్రద్ధధానః "అని అన్నాడు, కృష్ణుడు.

మొదట చెప్పినవాడు జ్ఞానం లేని వాడు. రెండవవాడు జ్ఞానం లేదనే బాధ కానీ, తెలిసి తీసుకోవాలి అనే శ్రద్ధ కానీ లేనివాడు.

సరే, పోనివ్వండి. జ్ఞానం లేదు. జ్ఞానాన్ని పొందాలనే శ్రద్ధ కూడా లేదు. ఇతని స్థితిని చూచి ఎవరో ఒక మహానుభావుడు అయ్యో! అని జాలిపడి, ఇతని దగ్గరకు వచ్చి మంచిని బోధిస్తాడు. అతని బోధనను విన్న తర్వాత అయినా, జ్ఞానం కలుగవచ్చు. మనకు జ్ఞానం లేకపోయినా, శ్రద్ధ లేకపోయినా, ఎవరి దగ్గరకి అయినా పోయి తెలిసిపోవాలి– అనే ప్రయత్నం లేకపోయినా, ఎవరైనా ఒక జ్ఞాని వచ్చి మంచిని ఉపదేశించవచ్చు కదా. ఏనాడో ఒకనాడు వారు మనలను కోవెలకు తీసుకొని పోయి, భగవంతుని ముందు నిలుపవచ్చు. మంచిని చెప్పవచ్చు. శ్రీరామాయణంలో ఇటువంటి మంచి విషయాలు ఉన్నాయి, మహాభారతంలో ఇటువంటి చక్కని తెలియదగిన విషయాలు ఉన్నాయి– అని ఆదరంగా చెప్పవచ్చు. ఇటువంటి కార్యాల వల్ల అయినా జ్ఞానం కలుగవచ్చు. కానీ, అప్పుడు కూడా, ఆ విధంగా మనకు మీద జాలితో, ఆదరంతో ఎవరైనా ఒక జ్ఞాని ఉపదేశించిన విషయంలోకూడా నమ్మకం లేకుండా, సందేహపడేవాడు మూడవ వర్గానికి చెందినవాడు. ఇతడే సంశయాత్మ. తనకు బోధించిన విషయాల పట్ల మనసులో ఎన్నెన్నో సందేహాలను పొంది, " ఇతడు ఈ విధంగా చెబుతున్నాడే! ఇది ఏ విధంగా యుక్తం? ఇది ఏ విధంగా తగినది? అని సందేహపడే స్వభావం కలవాడు, ఇతడు. ఎవరికైనా ఇతరులు చెప్పిన విషయంలో ఒక్కొక్కసారి సందేహం కలుగవచ్చు. సందేహం కలుగడం అపరాధం కాదు, కానీ, కలిగిన సందేహాన్ని చెప్పినవారి వద్దనే ప్రశ్నించి, వాస్తవాన్ని గ్రహించవచ్చు. సందేహం తీరినప్పుడు వారు చెప్పిన విషయాన్ని నమ్మవచ్చు. ఈ విధంగా కలిగిన సందేహాన్ని గూర్చి ప్రశ్నించకుండా, సందేహం తీరినపుడు నమ్మకుండా, నిరంతరంగా చెప్పిన విషయాలను నమ్మకుండా మనసులో పలు విధాలుగా సందేహపడుతూ ఉండే స్వభావం కలిగినవాడే సంశయాత్మ. ఇతడు కూడా నశిస్తాడు. ఈ విధంగా ఉండే అజ్ఞుడు, శ్రద్ధ లేనివాడు, నిరంతరం సందేహ పడేవాడు –అనే ఈ ముగ్గురిని గూర్చి గీతలో

శ్రీకృష్ణుడు ప్రస్తావిస్తూ, వీరి ముగ్గురికి నాశమే ఫలిస్తుంది. ఈ లోకంగాని, పరలోకంగాని వీరికి లేవు, వీరికి ఈ లోకంలో సుఖం లేదు, పరలోకంలో సుఖం లేదు, నిరంతరం సందేహపడుతూ నశించి పోవలసినదే – అని అంటాడు.

అందుచేత మనం భావించవలసినది, ప్రయత్నించవలసినది ఏమి? అంటే, ఈ ముగ్గురిలో ఏ ఒక్కరం కూడా మనం కాకూడదు– అని. తెలియని విషయాన్ని ప్రయత్నించి తెలిసికోవాలి. ఆ విధంగా కాకపోయినా, ఇంకా కాలం తెలియనందుకై విచారించి, తెలుసుకోవడం కోసం ఒక జ్ఞాని దగ్గరకు వెళ్లి తెలిసికోవాలి. , ఒకవేళ ఆ విధంగా మనం తెలుసుకోవాలి– అనే ఆశను, శ్రద్ధను, ప్రయత్నాన్ని కలిగి ఉండక పోయినా, ఎవరైనా ఒక జ్ఞాని వచ్చి మంచిని చెప్పినట్లయితే, దానిని సందేహపడకుండా అయినా నమ్మాలి. ఆ విధంగా తెలిసికోకుండా తెలిసికోవాలనే ఆశను, శ్రద్ధను లేకుండా, ఎవరైనా చెప్పినది నమ్మకుండా, నిరంతరం సందేహపడే సంశయాత్మ తప్పక నశిస్తాడు. మనం అంతా తెలుసుకోకపోయినా, తెలియనిదానిని తెలిసికోవాలని ప్రయత్నించడం మంచిది కదా!. పెద్దలు మనకు చెప్పిన దానినిగూర్చి కుతర్కాలు చేయకుండా, సందేహపడకుండా నమ్మడం మంచిది కదా. శ్రీకృష్ణుడు చెప్పిన ఈ ముగ్గురిలో ఎవరూకూడా మనం కావద్దు, కావద్దు, కావద్దు.

# శ్రీసేనైముదలియార్ (విష్వక్సేనుల) వైభవమ్

(ఉ. వే. శ్రీమాన్ మాడభూషి వరదరాజన్ స్వామివారి తమిళవ్యాసం ఆధారంగా)
దాసుడు– ఈ. ఏ. శింగరాచార్యులు.

ఓంగు తులా పూరాడత్తు ఉదిత్త శెల్వన్ వా*ఴ్*ియే
ఒండొడియాళ్ శూత్తిరవతి ఉఱై మార్బన్ వా*ఴ్*ియే
ఈంగు ఉలకిల్ శడకోపర్ క్కు ఇదమురైత్తాన్ వా*ఴ్*ియే
ఎ*ఴ్*ిల్ పిరంబిన్ శంగోలై ఏందుమవన్ వా*ఴ్*ియే
పాంగుడన్ ముప్పత్తు మూవర్ పణియుమవన్ వా*ఴ్*ియే
పంగయత్తాళ్ తిరువడయై ప*ఱ్ఱ్*ినాన్ వా*ఴ్*ియే
తేంగు పుక*ఴ్* అరంగనైయే శింధై శెయ్ వోన్ వా*ఴ్*ియే
శేనైయర్ కోన్ శెంగమల త్తిరువడికళ్ వా*ఴ్*ియే

**తాత్పర్యం**

ఉన్నతమైన తులా మాసంలో, పూర్వాషాఢా నక్షత్రంలో అవతరించినవారు, భగవత్ కైంకర్యసంపదను కలిగినవారైన విష్వక్సేనులు వర్ధిల్లాలి. ముంజేతి వలయాలు ఏ నాడు జారిపోని, పత్ని అయిన సూత్రవతీదేవి నివసించే వక్షస్సును కలిగిన విష్వక్సేనులు వర్ధిల్లాలి. ఈ లోకంలో నమ్మాళ్వారులకు హితాన్ని ఉపదేశించిన విష్వక్సేనులు వర్ధిల్లాలి. ప్రకాశించే బెత్తం అనే, అధికారాన్ని చెలాయించే దండాన్ని చేతిలో ధరించే విష్వక్సేనులు వర్ధిల్లాలి. అందంగా 33 మంది దేవతలచే సేవింపబడే విష్వక్సేనులు వర్ధిల్లాలి. తామర పువ్వులో పుట్టిన లక్ష్మీదేవి శ్రీపాదాలను ఆశ్రయించిన విష్వక్సేనులు వర్ధిల్లాలి. నిండుగా కీర్తిని కలిగిన శ్రీరంగనాథుని మనసులో ధ్యానించే విష్వక్సేనులు వర్ధిల్లాలి. భగవంతుని సేనకు అధిపతి అయిన విష్వక్సేనులు వర్ధిల్లాలి. ఎర్రని తామర పువ్వులవంటి విష్వక్సేనుల శ్రీచరణాలు వర్ధిల్లాలి.

**వ్యాఖ్యానమ్**

(ఓంగు తులా పూరాడత్తు ఉదిత్త శెల్వన్ వాழియే) "ఓంగు తులా" అంటే –ఉన్నతమైన తులా మాసం. తులా మాసానికి ఔన్నత్యం ఏమంటే– (చాంద్రమానం ప్రకారం) అశ్వినీ నక్షత్రాన్ని పౌర్ణమినాడు కూడిన మాసం ఆశ్వయుజమాసం అవుతుంది. ఈ మాసమే ఒక్కొక్కసారి (సౌరమానం ప్రకారం) తులామాసంకూడా అవుతుంది. అటువంటి మాసంలో, శ్రీవైష్ణవ గురుపరంపరలో ప్రధానులైన విష్వక్సేనులు పూర్వాషాఢా నక్షత్రంలో అవతరించారు. అందుచేత "ఓంగు తులా పూరాడమ్" అని కీర్తింపబడింది. అంతేకాక, ఈ మాంసం ముదలాళ్వారులు ముగ్గురు వెంట వెంటనే ఉండే నక్షత్రాలలో అవతరించిన గొప్పతనాన్ని కలిగినది. ఆచార్యులలో శ్రీపిళ్లైలోకాచార్యులవారు, శ్రీ మణవాళ మహామునులు మొదలైన ఆచార్యులు అవతరించిన ఉన్నతమైన మాసం ఇది.

విష్వక్సేనులకు కల సంపద ఏమంటే, భగవంతుడు ఆరగించిన ప్రసాదంలోని శేషాన్ని స్వీకరించే వైభవమే. ఈ ప్రసాదమే వీరికి ధారకం. ఇందువల్లనే శ్రీయామునులు స్తోత్ర రత్నంలో " త్వదీయ భుక్తోజ్ఝిత శేషభోజినా–– ప్రియణ సేనాపతినా" (42) అని అన్నారు. భగవద్రామానుజులు కూడా శ్రీ వైకుంఠ గద్యలో " శ్రీమతి విష్వక్సేనే న్యస్తసమస్తాత్మైశ్వర్యమ్" అని పలికిన విధంగా, కైంకర్య సంపదకు పెట్టి పుట్టిన సేనై ముదలియార్ పై భగవంతుడు తన అన్ని విధాలైన పరిపాలనా భారాన్ని పెట్టాడు– అని చెప్పడం గమనించవచ్చు. ఇంతే కాక, ఇంకా మిగిలిన ఆదిశేషుడు, గరుడుడు మొదలైనవారివలె నియమం లేకుండా, సర్వేశ్వరుడు ఆరగించిన శేషప్రసాదాన్ని తప్ప ఇక దేనిని ఆహారంగా స్వీకరించని ఒక నియమాన్ని కలిగినవారు కనుక, శేషాశనుడు అని ఇతడు చెప్పబడుతున్నాడు– అని తత్త్వత్రయ గ్రంథంలోని 45వ సూత్ర వ్యాఖ్యానంలో శ్రీమణవాళ మహామునులు అనుగ్రహించడం కూడా గమనించవచ్చు. కూరత్తాళ్వాన్ శ్రీ సుందర బాహుస్తవంలోని 72వ శ్లోకంలో " వనాద్రినాథస్య సుసుందరస్య ప్రభుక్తశిష్టాశీ సన్" అని అనడానికి తగినట్లుగా అర్చావతారంలో తిరుమాలిరుమ్ శోలై క్షేత్రంలోని

అఴగర్ శేషప్రసాదాన్ని ఆరగించేవారైన వీరికి శేషాశనులు అనే తిరునామం కలిగింది —అని కూడా అంటారు.

(ఒండొడియాళ్ శూత్తిరవతి ఉఱై మార్బన్ వాఴియే) " తొడి" అంటే— ముంజేతి కంకణం. దానికి అందం ఏమంటే— చేతినుండి జారిపోకుండా ఉండడం. అందమైన చేతికంకణాన్ని కలిగినది కనుక, సూత్రవతి "ఒండొడియాళ్" అని చెప్పబడుతున్నది. శ్రీ పరాశర భట్టర్ శ్రీరంగ రాజస్తవం పూర్వ శతకంలోని 54వ స్తోత్రంలో – లక్ష్మీదేవి శ్రీచరణాలలో సమర్పించిన పారాణి గుర్తులను కలిగినదై, ఆమె పాదాలను ఒత్తినప్పుడు ఏర్పడిన చిహ్నాలతో ప్రకాశించేదై, లతవంటి సుకుమారమైన, అందమైన రూపాన్ని కలిగినదై, విష్వక్సేనుల ప్రధాన మహిషియై సూత్రవతి ఉన్నది— అని అంటారు. అటువంటి సూత్రవతిని మనసులో కలిగినవారు సేనై ముదలియార్— అని అర్థం. వేదాంతదేశికులు యతిరాజసప్తతిలోని మూడవ శ్లోకంలో "వైకుంఠ సేనాన్యం దేవం సూత్రవతీసఖమ్" అనే విధంగా సూత్రవతిని సఖిగా కలిగినవాడు, వైకుంఠ సేనాధిపతి —అని అంటారు. తిరుమలిరుమ్ శోలై క్షేత్రంలో సూత్రవతితో కలసి, విష్వక్సేనులు విగ్రహరూపియై వేంచేసి ఉండి, దర్శనాన్ని అనుగ్రహించడం ఇక్కడ స్మరించాలి.

(ఈంగు ఉలకిల్ శడకోపర్ క్కు ఇదమురైత్తాన్ వాఴియే) ఈంగు— అంటే— ఈ లోకంలో— అని అర్థం. "సేనేశ కరుణాలబ్ధ దివ్యమంత్రద్వయం ముదా" అని గురుపరంపరా ప్రభావంలో పలికిన విధంగా, సేనై మదలియార్ కరుణతో ద్వయం అనే దివ్యమంత్రాన్ని నమ్మాళ్వారులకు ఉపదేశించారు. ఇంకే కాక, పరమపదనాథుని ఆజ్ఞతో సేనై ముదలియార్ వచ్చి, మంత్రాన్ని, మంత్రంలోని అర్థాలను అన్నిటిని, ద్రావిడ వేదాలు మొదలైనవానిని ఇతరుల చెవిలో పడని విధంగా ఉపదేశించి, వారిని దివ్యజ్ఞాన సంపన్నులను చేశారు— అని ఆ గ్రంథం తెలుపుతుంది.

(ఎ౹ప్రిల్ పిరంబిన్ శంగోలై ఏందుమవన్ వా౹ప్రియే) ఎ౹ప్రిల్ అంటే– ఔన్నత్యం, గొప్పతనం. బెత్తాన్ని ధరించేవాడు సేనై మొదలియార్. ఇక్కడ ఔన్నత్యం అంటే– సేనై ముదలియార్ తనకంటే పెద్దవాడు, సమర్థుడు– అని భగవంతుడు భావించి, పరమపదాన్ని, ఈ లీలావిభూతిని నిర్వహించే భారాన్ని అతనికి అప్పగించడమే. విద్యా రూపియై ప్రసిద్ధి చెందిన బెత్తాన్ని చేతిలో ధరించిన సేనై మొదలియార్ భగవంతుని కైకర్యాన్ని ఎదురు చూచి, శ్రీవైకుంఠంలో వేంచేసి ఉంటాడు– అని దివ్యసూరి చరితంలోని 66వ శ్లోకం తెలుపుతుంది. అంతేకాక, శ్రీయామునులు స్తోత్రరత్నంలో " యత్ యథా న్యవేది తత్ తథా అనుజానంతమ్ ఉదార వీక్షణైః" అని పలికినట్లుగా ఏ కార్యం ఏ విధంగా సేనై ముదలియార్ చేత విన్నపించబడిందో, అందులో, లోపల బయట ఉండే తేడాలు ఏమీ చూడడం లేదు, చేసే ప్రకారాలను భావించడం లేదు, కరుణ నిండిన కటాక్షాలతో ఆ కార్యాన్ని ఆ విధంగానే చేయండి– అని నియమించడమే ఈశ్వరుడు చేసే పని. సేనై ముదలియార్ మాటను భగవంతుడు పూర్తిగా అనుసరిస్తాడు, అంతే– అని అంటారు. ఇక్కడ "ఉదార వీక్షణం" అంటే– సౌహార్ధానురాగాలతో కూడిన కటాక్షాలు –అని అంటారు, వ్యాఖ్యాత పెరియ వాచ్చాన్ పిళ్ళై. అయ్యగారిచేత, అంటే, సేనై ముదలియార్ చేసేది ఏ విధంగా విన్నపించబడిందో, "అది ఆ విధంగానే"– అని నియమించడమే, భగవంతుడు చేస్తాడు. భట్టర్ శ్రీరంగరాజస్తవం పూర్వ శతకంలోని 50వ శ్లోకంలో సేనై ముదలియార్ ను భగవంతుని కైకర్యం చేసేవానినిగా చెప్పేటప్పుడు, అతడు– శ్రీరంగనాథుడు పిరాట్టితో కలసి క లీలావిహారాలు చేసే విధంగా శేషాసనంలో వేంచేసి ఉండేటట్లు చేసి, ఉభయ విభూతులలోని చేతనాచేతనాలను అన్నిటినీ నియమించే అధికారాన్ని ఎల్లప్పుడూ తన అంగుళి ముద్రలోనే నిర్వహిస్తున్నాడు– అని అంటారు. ఆ అంగుళి ముద్రను సేనై ముదలియార్ రూపాలలో కూడా గమనించవచ్చు. వేదాంతదేశికులు తాము అనుగ్రహించిన యతిరాజసప్తతి స్తోత్రంలోని మూడవ శ్లోకంలో " యద్వేత్ర శిఖరస్పందే విశ్వమేతత్ వ్యవస్థితమ్" అనే విధంగా తన చేతి అధీనంలో లోకాన్ని అంతటినీ నడిపి, నిర్వహిస్తాడు, సేనై ముదలియార్– అని అనడం గమనించవచ్చు. విజయనగర

ప్రభువైన శ్రీకృష్ణదేవరాయలు తాను రచించిన ఆముక్తమాల్యద అనే గ్రంథంలో శ్రీరంగంలో లోపలి వాకిటిలోని సేనై ముదలియార్ రూప సన్నివేశాన్ని వర్ణిస్తూ, చేతిలో బెత్తాన్ని ధరించి, చిత్రకంబళి పైన, తెల్ల తామరలవంటి కన్నులను కలిగినవాడై, అంగుళీయకం ప్రకాశిస్తూ ఉండగా, రెండు వైపులా కొంచెం నమస్కరించే సన్నివేశంలో స్థిరంగా ఉండే గజముఖులు నూరు మంది సేవించగా, వేంచేసి ఉన్నాడు విష్వక్సేనుడు –అని అనడం చూడవచ్చు. కుంభకోణక్షేత్రంలోని ఆరావముదాళ్వాన్ సన్నిధిలో విష్వక్సేనుల ఉత్సవమూర్తి నిలుచున్న సన్నివేశంలో ఉండడం గమనించాలి.

(పాంగుడన్ ముప్పత్తు మూవర్ పణియుమవన్ వాళ్ియే) 33 మంది దేవతలు ఎవరంటే, 8 మంది వసువులు, 11 మంది రుద్రులు, 12 మంది ఆదిత్యులు, అశ్వినీ దేవతలు ఇద్దరు, మొత్తం 33 మంది దేవతలు. పరమపదంలో ఉండే నిత్యుల, ముక్తుల సమూహానికి, మిగిలిన లోకాలలో ఉండే భగవంతుని భక్తులకు నాయకుడు కనుక, సేనై ముదలియార్ అని, సేనై త్తలైవర్ అని విష్వక్సేనులను వ్యవహరించడం జరుగుతున్నది.

(తేంగు పుకళ్ అరంగనైయే శింద్తై శెయ్ వోన్ వాళ్ియే) విష్వక్సేన సంహితలో– లక్ష్మీదేవి అనుగ్రహాన్ని పొంది, అందువల్ల "శ్రీమతి విష్వక్సేనే" అనే విధంగా భగవత్ కైకర్య సంపదను కలవాడు, విష్వక్సేనులు– అని చెప్పబడింది.

(శేనైయర్ కోన్ శెంగమల త్తిరువడికళ్ వాళ్ియే) "శేనైయర్ కోన్ "– పరమపదంలో ఉండే నిత్యులకు, ముక్తులకు నాయకుడు. " "అశైవిల్ అమరర్ తలైవర్" (తిరువాయ్ మొళ్ి–5 –8 –9) అనుగ్రహించడానికి తగినట్లుగా, జ్ఞానంలో హెచ్చు తగ్గులు లేనివారై ఉండే అమరులు ఉన్నారు, నిత్యసూరులు వారు. వారికి నాయకుడైన శ్రీసేనై ముదలియార్– అని అంటారు, నమ్బిళ్ళై. వీరి కార్యం కూడా భగవంతుని బుద్ధికి అధీనమై ఉంటుంది– అని అంటారు. "వానవర్ వానవర్ కోనుడుమ్" అనే సందర్భంలో

"వానవర్" అంటే– నిత్య సూరులు, "వానవర్ కోన్ "అంటే – సేనైముదలియార్. అతనితో పాటు దివ్యమైన పుష్పాలతో అక్రమంలో వారు అర్చిస్తారు (తిరువాయ్ మొழி– 3–3–2) అని నమ్మాళ్వార్ చాలా రసఘనంగా వ్యాఖ్యానించడం గమనించవచ్చు నమ్మాళ్వారులు "కోయిల్ కొళ్ దైవమెల్లామ్" (తిరువాయ్ మొழி– 8 –6– 5) అని అనుగ్రహించడానికి తగినట్లు, పరమపదంలో సేనై ముదలియార్ కు ఒక కోవెల ఉన్నది– అని అంటారు. అంతేకాక, గజాననుడు మొదలైనవారికి ప్రపత్తి శాస్త్రాన్ని సేనై ముదలియార్ అనుగ్రహించారు– అని కూడా పిళ్లైలోకమ్ జీయర్ అంటారు. శ్రీరంగంలో రెండవ ప్రాకారంలో ఈశాన్యంలో హనుమంతుడు విభీషణుడు మొదలైనవారితో పాటు సేనై ముదలియార్ కూడా వేంచేసి ఉండడం చూడవచ్చు. "అమరర్ కోన్ అర్చిక్కిన్ఱ" (తిరువాయ్ మొழி– 10–2 –6) అని నమ్మాళ్వారులు పలికినదానికి తగినట్లు " తిరువనంతపురంలో " శ్రీ సేనాపతి ఆழ்వాన్ నిత్య కైంకర్యమ్ పణ్ణుకిఱాన్, నిత్యసూరికళ్ ఎడుత్తు క్కై నీట్టువర్" అని నమ్మాళ్వార్ అనుగ్రహిస్తారు అంతేకాక, నిత్య సూరులకు నాయకుడైన సేనై ముదలియార్ అనంతపద్మనాభుడు అర్చనకు తగినట్లు తన ముఖాన్ని, మూడు వాకిళ్ళలో, మొదటి వాకిలిలోనే అనుగ్రహిస్తాడు– అని ఆచార్య హృదయంలో 183వ చూర్ణికలో అழகియ మణవాళ ప్పెరుమాళ్ నాయనార్ రసఘనంగా అనుభవించడం గమనించవచ్చు.

ఇటువంటి గొప్పతనాలను కలిగిన సేనై ముదలియార్ ప్రతిదినం శ్రీవైష్ణవులు అనుసంధించే గురుపరంపరలో, ఆరోహణ క్రమంలో, లక్ష్మీదేవికి తరువాత "శ్రీ విష్వక్సేనాయ నమః" అని వేంచేసి ఉండడం సంప్రదాయం. అటువంటి అతిశయాన్ని కలిగిన సేనై ముదలియార్ శ్రీపాదాలకు మంగళాశాసనం చేద్దాం.

నిత్యశ్రీః నిత్య మంగళమ్

## భగవానుడు దివ్యరూపంతో ఎందుకు అవతరిస్తున్నాడు?

జీవులమైన మనమంతా మనకు తగిన ఒక శరీరంతో జన్మిస్తున్నాము. అన్నం, నీరు మొదలైనవాటితో దానిని వృద్ధి చేసుకుంటున్నాము, శ్రద్ధగా కాపాడుకుంటున్నాము. దానికి మంచి వస్త్రాలను, అందమైన ఆభరణాలను చక్కగా అలంకరించుకుంటున్నాము. ఆనందిస్తున్నాను మనలను ఇతరులను గుర్తించటానికి ఈ శరీరం ఉపయోగపడుతున్నది. అందువల్లనే ఇది రూపం అనబడుతున్నది. మనం ఇంతకు ముందు చేసిన కర్మలకు అనుగుణంగా సుఖదుఃఖాలను అనుభవించడానికి ఈ శరీరం సాధనంగా ఉపయోగపడుతున్నది. ఇవి అన్నీ మనం ఒక శరీరంతో జన్మించడానికి కారణమైనవి, ఆవశ్యకమైనవి. ఆకలి, దాహం, కోపం, తాపం, ఆశ, నిరాశ మొదలైనవి అన్నీ ఈ శరీరం మూలంగానే మనకు కలుగుతున్నాయి. వినడం, చూడడం, రసానుభవాన్ని పొందడం, వాసన చూడడం మొదలైనవి అన్నీ ఈ శరీరం మూలంగానే మనకు కలుగుతున్నాయి వీలవుతున్నాయి.

అయితే, ఇటువంటి కార్యాలు అన్నీ సంభవించడానికి భగవంతునకు శరీరం అనేది సాధనంగా ఆవశ్యకం కాదు. ఆ స్వామికి కర్మలు అనేవి లేవు. అందువల్ల కర్మఫలాన్ని అనుభవించవలసిన ఆవశ్యకత లేదు. పుణ్యాన్ని ఆర్జించి, దాని ఫలంగా స్వర్గానికి పోయి, అక్కడ ఆనందాన్ని అనుభవించాలి— అనే ఆశ, ఆవశ్యకత ఆ స్వామికి లేవు. అందుచేత స్వర్గంలోని అనుభవానికి కావలసిన భోగశరీరం కూడా అతనికి అక్కరలేదు. ఆ విధంగానే, పాపాలను చేసినందున నరకంలో ఆ పాపాలకు తగిన అనుభవాన్ని అనుభవించడానికి అక్కడ కావలసిన శరీరమూ అక్కరలేదు. పుణ్య పాపాలను చేసి. ఆ రెండిటి అనుభవాలైన సుఖదుఃఖాలను కలిపి ఈ లోకంలో అనుభవించడానికి మానవులకు కావలసిన శరీరంకూడా అక్కరలేదు. ఇవి ఏమీ భగవంతునకు అక్కరలేదు. ఎందుకంటే, ఆయనకు కర్మలు అనేవి లేనేలేవు కదా.

సరే, కర్మల అనుభవానికి భగవంతునకు శరీరం అక్కరలేదు. ఒకరిపై కోపపడడానికి, ప్రీతి పడడానికి, ఒకరిని రక్షించడానికి, లేక, శిక్షించడానికి మనకు శరీరం ఆవశ్యకమైనట్లుగా, భగవంతునకు ఆవశ్యకమా? అంటే, దానికికూడా అక్కరలేదు. వీటిని అన్నిటినీ భగవంతుడు తన కేవలం సంకల్పంతోనే నిర్వహించగలడు, నిర్వహిస్తున్నాడు కూడా.

అయితే, మరి, భగవంతుడు ఈ లోకంలో ఒక రూపంతో జన్మిస్తున్నాడే! ఎందుకోసం? అనే ప్రశ్న వెంటనే కలుగుతుందికదా! దీనికి శ్రీవిష్ణుపురాణం 5వ అంశంలో మొదటి అధ్యాయంలో ఉండే ఒక శ్లోకం మనకు చక్కని సమాధానాన్ని ఇస్తున్నది. " నాకారణాత్ కారణాద్వా కారణాకారణాన్న చ, శరీరగ్రహణం వ్యాపిన్! ధర్మత్రాణాయ కేవలమ్" అనేది ఆ శ్లోకం. భగవన్! నీవు అంతటా, ఏ లోటు లేకుండా పూర్తిగా వ్యాపించి ఉన్నావుకదా! అందుచేత ఎక్కడ నుండి అయినా నీవు అనుకున్న పనిని చేయగలవు. మరి, నీకు ఈ శరీర గ్రహణం ఎందుకోసం? నీవే నీరు, నిప్పు, ఆకాశం, భూమి, అగ్ని అంతా కూడా. వీటి అన్నిటిలోనూ నీవు వ్యాపించి ఉన్నావు. "నాకారణాత్"– దుఃఖాన్ని నరకంలో అనుభవించడానికి కావలసిన యాతనాశరీరం అనేది నీకు అక్కరలేదు. "నా కారణాద్వా"– సుఖాన్ని స్వర్గంలో అనుభవించడానికి కావలసిన భోగశరీరంకూడా అక్కరలేదు. " కారణాకారణాన్న చ"– మానవ రూపాన్ని ఎత్తి, ఈ లోకంలో సుఖదుఃఖాలను అనుభవించవలసిన ఆవశ్యకత కూడా నీకు లేదు. మరి, నీవు ఎందుకోసం "ఇచ్ఛాగృహీతాభిమతోరుదేహః" అని చెప్పిన విధంగా నీ ఆశకు తగిన రూపాన్ని ఈ లోకంలో ధరిస్తున్నావు? అంటే, "కేవలం ధర్మత్రాణాయ"– నీవు ధర్మాన్ని రక్షించడం కోసమే ఈ లోకంలో ఒక రూపాన్ని ధరిస్తున్నావు. ధర్మసంస్థాపనం కోసమే శరీర గ్రహణాన్ని చేస్తున్నావు, ఇంతే. ధర్మాన్ని రక్షించడం కోసం అయినా నీకు శరీర గ్రహణం ఆవశ్యకమా? నీ సంకల్పంతోనే నీవు ధర్మాన్ని స్థాపించలేవా? లేక, నీ చేతిలో ఉండే సుదర్శనాన్ని ఉపయోగించి, ధర్మాన్ని నిలుపలేవా? సందేహం లేదు, చేయగలవు.

అంతటా నీవు వ్యాపించి ఉన్నావు కదా. ఎక్కడ నుండి అయినా, ఏ విధంగా అయినా, ఏ కార్యాన్ని అయినా నీవు చేసి, ధర్మాన్ని స్థాపించగలవు.

మరి, ఎందుకు కోసం నీవు శరీరాన్ని పరిగ్రహించడం? ధర్మత్రాణమంటే ఏమి? అంటే, ధర్మాన్ని అనుసరించి వర్తించే మహానుభావుల ఆశను తీర్చడం కోసమే నీవు ఈ విధంగా ఒక రూపాన్ని ఈ లోకంలో పరిగ్రహించి అవతరిస్తున్నావు. ధార్మికులైనవారి ఆశను నెరవేర్చడం కోసమే రూపాన్ని గ్రహిస్తున్నావు. ధార్మికులు ఏమని ఆశపడతారు? " భగవన్! నీ దివ్యరూపాన్ని దర్శించాలని ఆశపడుతున్నాము. దానిని మా కన్నులకు గోచరం అయ్యేటట్లు అనుగ్రహించు" అని కదా ఆశపడి ప్రార్థిస్తారు. మనం కోవెలలకు ఎందుకు వెడతాము? భగవంతుని దివ్యమంగళమూర్తిని దర్శించాలని ఆశతో కదా వెడతాము. రేపల్లెలో ఉండేవారికి దేనివలన ఆనందం? శ్రీకృష్ణుని దివ్య రూపాన్ని చూసినందున వారికి ఆనందం. అయోధ్యా పురజనులకు ఎందువల్ల ఆనందం? శ్రీరామచంద్రమూర్తి సుందర రూపాన్ని దర్శించినందున వారికి ఆనందం. భగవంతుడు ఈ విధంగా దివ్యరూపాన్ని పరిగ్రహించి, అవతరించకపోతే కేవలం గాలివలె ఆకాశంవలె అంతటా వ్యాపించి ఉంటే, ఏ విధంగా భక్తులు దర్శించగలరు? వారి ఆశ ఏ విధంగా నెరవేరుతుంది? వారికి ఆనందం ఏ విధంగా కలుగుతుంది? అందుచేత, భగవంతుడు ఒక రూపంలో, దివ్యమంగళ విగ్రహంతో జన్మిస్తేనే వారి ఆశ తీరుతుంది. నమ్మాళ్వారులు కూడా ఒకచోట "కోలమేని కాణ వారాయ్! " – స్వామీ! నీ సుందర రూపాన్ని మేము దర్శించేటట్లుగా రావయ్యా! – అని ప్రార్థించారు. అందుచేత భగవంతుడు ఒక దివ్య రూపాన్ని ధరించి అవతరించడానికి కారణం ధర్మత్రాణం. ధర్మాన్ని రక్షించడానికే. అది కూడా ధర్మాన్ని అనుసరించి వర్తించే మహానుభావుల ఆశను అనుసరించి, వారికి తన దివ్యమంగళ రూపాన్ని దర్శింప జేయడం కోసమే, భగవంతుడు శరీరగ్రహణాన్ని చేస్తున్నాడు. లేకపోతే, భగవంతుడు రూపాన్ని ధరించవలసిన ఆవశ్యకత ఏ విధంగానూ లేదుకదా. అందుచేత, మన రూపానికి, భగవంతుని రూపానికి మధ్య ఎంత తేడా ఉన్నది! దాని ప్రయోజనంలోనే ఎంతటి

వ్యత్యాసం ఉన్నది! దీనిని తెలుసుకొని మనం భగవంతుని రూపాన్ని దర్శిస్తే, మనలోని సత్వగుణం అభివృద్ధి అవుతుంది. భగవంతుని దివ్యమంగళ రూపాన్ని ప్రేమతో, ఆశతో దర్శించగా దర్శించగా, మన మనసులోని దోషాలు క్రమంగా తొలగి, సత్వగుణం అభివృద్ధి చెందుతుంది– అని శాస్త్రాలు తెలుపుతున్నాయి. అందుచేత. మన ఆరాధనలో, దేవాలయాలలో ఉండే భగవన్మూర్తులను ఆ భావనతో దర్శిద్దాం. మనలోని సత్వగుణాన్ని అభివృద్ధి చేసికోవడానికి ప్రయత్నిద్దాం. స్వస్తి.

## భగవంతుడు అర్చారూపంలో ఎందుకు పరుండి ఉన్నాడు?

భగవంతుడు కొన్ని క్షేత్రాలలో నిలుచుని ఉండి, మరికొన్ని క్షేత్రాలలో కూర్చుని ఉండి, ఇంకా మరి కొన్ని క్షేత్రాలలో పరుండి ఉండి దర్శనమిస్తున్నాడు. నిలుచుని ఉండడం, కూర్చుని ఉండడం అనేవి అర్థం చేసుకోవడానికి వీలవుతుంది. కానీ, భగవంతుడు పరుండి ఉండడం ఏమిటి? లోకంలో ఎవరైనా ఎప్పుడు పడుకుంటారు? శ్రమ కలిగితే కదా పడుకుంటారు. భగవంతునకు ఏమి శ్రమ? అతనికే శ్రమ కలిగి పరుండి ఉంటే, ఇంక, మన గతి ఏమి?

పరిపాలన చేసేవాడు సింహాసనంలో కూర్చుని పరిపాలన సాగిస్తాడు. భగవంతుడు లోకపరిపాలకుడు కనక, కూర్చున్న సన్నివేశంలో దర్శనం ఇస్తున్నాడు– అని భావించవచ్చు. వేగంగా పనిచేయాలి అంటే, నిలుచుని గాని, నడుస్తూ కాని పని చేయాలి. అందుచేత, భగవంతుడు నిలుచున్న సన్నివేశంలో దర్శనాన్ని ఇవ్వడాన్ని కూడా కొంతవరకు అర్థం చేసుకోవచ్చు. కానీ, భగవంతునకు శ్రమ అనేది ఉండే అవకాశం లేదు. మరి, భగవంతుడు ఎందుకు పరుండి ఉన్నాడు? అనే ప్రశ్న కలుగుతుంది.

భగవంతుడు ఎందుకు శయన సన్నివేశంలో దర్శనాన్ని అనుగ్రహిస్తున్నాడు? అనే విషయాన్ని గూర్చి మన పూర్వాచార్యులు ఇంతకు ముందే పలు విధాలైన చక్కని సమాధానాలను తెలియజేశారు.

ఈ విషయాన్ని పలు కోణాలలో దర్శించి సమాధానాన్ని గ్రహించవచ్చు. భగవంతుడు సర్వశక్తి. అందుచేత, అతడు కూర్చుని గాని, నిలుచుని గాని, కదులుతూ గాని కార్యాలను నిర్వహించాలి– అనే నియమం లేదు. ఏ సన్నివేశంలో అయినా, ఎప్పుడైనా తలచిన కార్యాన్ని నిర్వహించగలిగిన సంకల్పశక్తి భగవంతునకు ఉన్నది. మనం పనిచేయాలంటే నిలుచుని పనిచేయాలి, లేక, కూర్చుని పని చేయాలి. కానీ ఈ

నియమం భగవంతునకు లేదు కదా. ఉన్నచోటలోనే, ఉన్న సన్నివేషంలోనే కేవలం సంకల్పంతోనే ఎటువంటి కార్యాన్ని అయినా సాధించగలిగిన శక్తి భగవంతునకు ఉన్నది కదా. "పరాస్య శక్తిః తే వివిధైవ శ్రూయతే" అని కదా వేదం భగవంతుని శక్తిని పొగడుతున్నది. అందుచేత నిలుచుని ఉండడం, కూర్చుని ఉండడం అనే మిగిలిన సన్నివేశాలను కొంతవరకు అర్థం చేసుకోవచ్చు— అని భావించడం కూడా సరి కాదు. "అక్కరలేదు" అని అంటే, ఈ మూడు సన్నివేశాలు కార్యనిర్వహణానికి భగవంతునికి అక్కరలేదు. నిలువ నక్కరలేదు, కూర్చుండనక్కరలేదు, పరుండనక్కరలేదు. ఎంత అరుదైన, దుష్కరమైన కార్యాన్ని అయినా, కేవలం సంకల్పంతోనే చేయగలడు, అతడు. అటువంటి జ్ఞాన శక్తులను కలిగినవాడు, అతడు. అందుచేత ఆ కోణంలో చూడడం, ప్రశ్నించడం సరికాదని ఏర్పడుతున్నది.

అయితే, మరి, భగవంతుడు ఎందుకు పరుండి ఉన్నాడు? అంటే, ఈ సన్నివేశాలు అన్నీ భక్తులకోసమే. "న తే రూపం న చాకారో నా నాయుధాని న చాస్పదమ్, తథాపి పురుషాకారో భక్తానాం త్వం ప్రకాశసే" అని జితంతే స్తోత్రం అంటున్నది. "నీ రూపం కాని, నీ ఆయుధాలుగాని, నీ అలంకారాలు గాని, నీ ఉత్సవాలు కాని, నీవుండే సన్నివేశాలు కానీ, ఏవీ నీ కోసం కాదు. అన్నీ భక్తుల కోసమే, భక్తుల ఆనందం కోసమే"— అని అంటున్నది. "మనలో భక్తిని కలిగించాలి, తన విషయంలో ప్రీతిని కలిగించాలి, మోక్షంలో రుచిని కలిగించాలి, తరింప చేయాలి" అనే ఉద్దేశంతోనే భగవంతుడు వీటిని అన్నిటినీ కలిగి ఉన్నాడు. " నిన్ఱ వాఝుమ్ ఇరుంద వాఝుమ్ కిడంద వాఝుమ్ నినైప్పు అరియన" అని నమ్మాళ్వారులు పలికినట్లుగా, కొందరికీ నిలుచున్న సన్నివేశం రుచిస్తుంది, మరికొందరికి కూర్చున్న భంగిమ ఇష్టం అవుతుంది, ఇంకా, మరి కొంతమందికి పరుండి ఉండే సన్నివేశం అందంగా తోస్తుంది. " తమరుకన్దదు ఎవ్వురువమ్ అవ్వురువమ్ తానే" (భక్తులు ఇష్టపడేది ఏ రూపమో, ఆ రూపాన్నే భగవంతుడు పరిగ్రహిస్తాడు) . ఇది మొదటి సమాధానం. భక్తులను తనవైపు ఆకర్షించాలి, మంచి మార్గంలో పెట్టాలి, తరింప చేయాలి— అనే భావంతోనే

భగవంతుడు ఈ విధంగా పలు విధాలైన సన్నివేశాలలో, భంగిమలలో దర్శనం ఇస్తున్నాడు– అనేది మొదటి సమాధానం.

తరువాత, భగవంతుడు దర్శనం ఇచ్చే మూడు విధాలయిన భంగిమలలో ఏది చాలా సుందరమైనది? అని గమనిస్తే, పరుండి ఉండే సన్నివేశమే చాలా అందమైనది. " కిడందదు ఓర్ కిడక్కై" అని ఈ భంగిమను ఆళ్వారులు ప్రశంసిస్తారు. " అరవినణైమిశై మేయ మాయనార్" అని తిరుప్పాణ్ పెరుమాళ్ అమలనాదిపిరాన్ అనే ప్రబంధంలో శ్రీరంగనాథుని శయన భంగిమలోని అందాన్ని గానం చేశారు. భగవంతుడు నిలుచున్న భంగిమను, కూర్చున్న భంగిమను దర్శించినప్పుడు కంటే, శయనించి ఉండే సన్నివేశాన్ని దర్శిస్తే భక్తుల మనస్సు మిక్కిలిగా ద్రవిస్తుంది. అందువల్ల, భక్తుల మనసులను ద్రవింప చేయడానికి కోసం ఈ విధంగా శయన సన్నివేశాన్ని భగవంతుడు స్వీకరించాడు. ఇది రెండవ సమాధానం.

ఇంకొక సమాధానం ఏమంటే, "శ్రమ కలిగితే కదా శయనించాలి. భగవంతునకు శ్రమ అనేది ఉండదు కదా. మరి, ఎందుకు అతడు శయనించాడు?" అనేది ప్రశ్న. ఆ విధంగా ఆలోచిస్తే ఆకలి ఉంటే కదా, అన్నాన్ని భుజించాలి. భగవంతునకు ఆకలి అనేది ఉన్నదా? లేదు కదా! మరి, ఏ కారణం వల్ల మనం ప్రసాదాన్ని భగవంతునకు నివేదన చేస్తున్నాము? ఆ స్వామికి ఏమి ఆకలి ఉన్నదని ప్రసాదనివేదనను చేస్తున్నాము?. భగవంతునకు నడవడం చేతకాదా? మరి, ఎందుకు ఆ స్వామిని వాహనాలపై వేంచేపు చేసి, ఊరేగింపులు జరుపుతున్నాము? విగ్రహరూపంలో భగవంతుడు వేంచేసి ఉన్నపుడు భగవంతుడు తనకు సహజంగా కలిగిన గొప్పతనాలను అన్నిటినీ మరచి, తన స్థితిగతులను అన్నిటిని భక్తుల అధీనంలో కలిగి ఉంటాడు– అని కదా శాస్త్రాలు చెబుతున్నాయి. " "అర్చకపరాధీనాఖిలాత్మ స్థితిః" అని పరాశర భట్టర్ అంటారు. భక్తులతో కలిసిమెలసి ఉండడం కోసం, మనం ఏమేమి చేస్తున్నామో, వాటిని అన్నిటినీ భగవంతుడు అంగీకరిస్తాడు. గ్రహిస్తాడు. ప్రసాదాన్ని స్వీకరించడం, ఉత్సవాలను

అంగీకరించడం, అలంకారాలను గ్రహించడం అని మొదలైనవానిని అన్నిటిని మనకోసమే భగవంతుడు అంగీకరిస్తాడు. అంతే కాదు, భగవంతుడు శయనించడం అనేది ఎటువంటిది? ఎందుకోసం? అనే విషయాన్ని శాస్త్రాలు, ఆళ్వారులు తెలియజేశారు. " ఉఱంగువాన్ పోల్ యోగు శెయ్ ద పెరుమాన్" అని అన్నారు, ఆళ్వారులు. " నిద్రాసి జాగర్యయా" అని అన్నారు, భట్టర్. భగవంతుడు పరుండి ఉన్నా, మనవలె తామసమైన నిద్రను పొందడు. జగత్తును ఏ విధంగా రక్షించాలి? అని ఆలోచిస్తూ ఉంటాడు. దీనికి జగద్రక్షణ చింత అని పేరు. అందువల్ల భగవంతుని శయనసన్నివేశం నిద్రను సూచించదు. ఆ సన్నివేశంలో అతడు తన రూపాన్ని తానే చింతిస్తూ, తన భక్తులను ఏ విధంగా రక్షించాలి, ? అని ఆ స్థితిలో ఆలోచిస్తూ ఉంటాడు. ఇది మరొక సమాధానం.

చివరి సమాధానం ఏమంటే, భగవంతుడు వేంచేసి ఉండే ఈ మూడు సన్నివేశాలు భగవంతుని భక్త రక్షణ త్వరను సూచిస్తాయి. . ఇక్కడ లౌకికమైన ఒక ఉదాహరణాన్ని గమనిద్దాం. వంట ఇంటిలో అన్నం వండబడుతున్నది. ఒకనికి చాలా ఆకలిగా ఉన్నది. వంటగది దగ్గరకు వెళ్లి, "వంట అయినదా? అన్నం ఉడికిందా?" అని అడుగుతాడు. " లేదు ఒక పది నిమిషాలలో సిద్ధం అవుతుంది" అని లోపల నుండి సమాధానం వస్తుంది. అతడు కాసేపు నిలుచుంటాడు. ఆకలిని తట్టుకోలేక మళ్ళీ వెళ్లి, "వంట అయినదా?" అని అడుగుతాడు. "లేదు ఇంకొక పది నిమిషాలలో పూర్తి అవుతుంది" అనే సమాధానం వచ్చింది. అప్పుడు అతడు నించునే శక్తి లేక కూర్చుంటాడు. మళ్లీ కొంతసేపటికి వంటగది దగ్గరకు వెళ్లి, "అన్నం సిద్ధమైనదా?" అని అడుగుతాడు. "లేదు, ఇంకొక ఐదు నిమిషాలలో పూర్తి అవుతుంది. " అనే సమాధానం వస్తుంది. ఇక, ఆకలిని అతడు తట్టుకోలేక పరుండిపోతాడు. అన్నం ఉడికి భుజిస్తే తప్ప లేవలేక పరుండిపోతాడు. "అన్నం సిద్ధమైనదా?" అని మొదట అడిగి నిలచి, తరువాత అడిగి కూర్చొని, తరువాత అడిగి, ఇక సహించలేక పరుండిపోతాడు. భగవంతుని పరిస్థితికూడా ఇటువంటిదే. మనం భగవంతునకు అన్నంవంటివారం కదా. " అహమన్న మహమన్న

మహామన్నమ్" అని వేదం ఈ విషయాన్ని చెబుతున్నది. మనం భక్తి అనే దశను పొంది భగవంతుని అనుభవానికి యోగ్యతను పొందామా? అని భగవంతుడు మొదట నిలుచుని గమనిస్తాడు. ఆ తరువాత. మన ఆలస్యాన్ని సహించలేక కూర్చుంటాడు. అప్పటికీ మనం పక్వం కాకపోతే, ఇక నిలువ లేక, "మనం పరిణతిని చెందే వరకు, పక్వం అయ్యేవరకు విడచిపోను"– అని తలచి, పరుండి పోతాడు. లోకంలో, ఒక్కడు నిలుచుండి మాట్లాడితే, అతడు మాట్లాడిన వెంటనే వెళ్ళిపోతాడు– అని అర్థం. కూర్చొని మాట్లాడితే, కొంతసేపు ఉండి తరువాత వెడతాడు– అని అర్థం. అతడు పడకగదిని వెదికి, వెళ్లి పడుకుంటే, ఇప్పటిలో అతడు ఇల్లు విడిచి పోడు–అని అర్థం. ఆ విధంగానే, భగవంతుడు శయనించిన సన్నివేశం ఏమి సూచిస్తున్నదంటే, మనం పొందవలసిన పరిణతిని పొంది, బాగుపడితే తప్ప, మనలను విడిచి పోకూడదు– అనే నిశ్చయంతోనే భగవంతుడు శయనించాడు– అని తెలుపుతున్నది.

ఈ విధంగా పలు విధాలుగా మన పూర్వాచార్యులు భగవంతుడు పరుంధు ఉండే సన్నివేశంలోని తాత్పర్యాన్ని మనకు తెలియజేశారు. ఎన్నో దివ్య దేశాలలో భగవంతుడు శయన సన్నివేశంలో సాక్షాత్కరిస్తున్నాడు. భక్తుల హృదయాలను దోచుకుంటున్నాడు. మనం కూడా ఆ భంగిమను భక్తిలో దర్శించి, ఆనందాన్ని పొందుదాం, రండి.

# త్రివిక్రముడొక అద్భుత వైద్యుడు

భగవంతుడు ఎత్తిన అనేక అవతారాలలో త్రివిక్రమావతారం చాలా ప్రసిద్ధమైనది. అతడు మొదట చాలా పొట్టిగా ఉండే వామన రూపాన్ని ధరించాడు, బలి దగ్గర మూడడుగులను అడిగ ఆ దానం దానం ఇవ్వగానే, చాలా వేగంగా పెరిగి త్రివిక్రముడయ్యాడు. పెద్ద రూపంతో లోకాలను అన్నిటినీ కొలిచాడు. ఇదంతా ఎందుకు చేశాడు?

మొదట మూడు లోకాలు ఇంద్రునకు చెందినవి. వాటిని మహాబలి బలాత్కారంగా తన స్వాధీనం చేసుకున్నాడు అప్పుడు, ఇంద్రుడు మళ్ళీ వాటిని పొందడం కోసం భగవంతుని ప్రార్థించాడు. భగవంతుడు వాటిని బలి దగ్గర నుండి ఏ విధంగా తిరిగి గ్రహించాలి? అని ఆలోచించి, మొదట వామన రూపాన్ని ధరించి, ఆ చిన్న రూపంతో బలి దగ్గరకు వెళ్లి అతని వద్ద మూడు అడుగుల నేలను గదానంగా ఇమ్మని యాచించాడు. ఆ దానాన్ని పొందగానే, పెద్ద రూపాన్ని ధరించి, ఒక పాదంతో భూలోకాన్ని, మరి ఒక పాదంతో పైలోకాలను కొలిచాడు. ఈ విధంగా ముల్లోకాలను స్వాధీనం చేసికొని, ఇంద్రునకు తిరిగి ఇచ్చాడు– అనే ఈ కథను మనం పురాణ ఇతిహాసాల ద్వారా వింటున్నాము.

ఈ అవతారం కృతయుగంలో సంభవించిన అవతారం. ఇప్పుడు మనం ఉన్నది కలియుగంలో. ఎప్పుడో కృతయుగంలో జరిగిన వృత్తాంతాన్ని ఎంతో కాలం తరువాత, ఇప్పుడు కలియుగంలో ఉండే మనం వినడం వల్ల తెలుసుకోవడం వల్ల ఏమి ప్రయోజనం? ఈ వృత్తాంతం వల్ల మనకి ఏమి తెలియదగిన విషయం తెలుస్తున్నది? అనే ప్రశ్న కలుగవచ్చు. ఇది పైపైన చూస్తే, చాలా తేలిక అయిన ప్రశ్న అని తోచినప్పటికీ, లోతుగా చూస్తే, నిజానికి ఇది చాలా లోతైన ప్రశ్న. గాఢంగా గమనించి చూడవలసిన విషయం.

మనం అంతా భగవంతునకు శేషమై ఉండేవారం. ఆ స్వామి చేత సృష్టింపబడినవారం, రక్షింపబడేవారం అనేది మనం అంతా తెలిసికొని, ఎల్లప్పుడూ మనసులో స్థిరంగా నిలుపుకోవలసిన తత్త్వం. దీనిని ఉపనిషత్తులు, ఇతిహాస పురాణాలు పదే పదే చెబుతున్నాయి. మనం ఎల్లప్పుడూ మనసులో పెట్టుకోవాలని ఉపదేశిస్తున్నాయి.

కానీ, మనం ఈ భావాన్ని మనసులో కలిగి ఉన్నామా? ఈ తత్త్వాన్ని గుర్తించి, దానికి తగినట్టు ప్రవర్తిస్తున్నామా? అని అంటే, లేదనే చెప్పాలి. మనం ఈ విషయంలో రెండు విధాలైన వ్యాధులతో బాధపడుతున్నాము. అయితే, ఈ రెండు విధాలైన రోగాలు అందరిలోనూ ఉన్నాయని చెప్పలేము. కొంతమందిలో ఒక విధమైన వ్యాధి, మరి కొంతమందిలో ఇంకొక విధమైన వ్యాధి ఉండవచ్చు. అయితే, ఈ వ్యాధులలో ఏదో ఒకటి ఇంచుమించుగా ఈ లోకంలో ఉండే మనలో, పై లోకాలలో ఉండే ఇంద్రుడు మొదలైన దేవతలలో కూడా ఉన్నది— అనే చెప్పాలి. ఆ రెండు వ్యాధులలో ఒక వ్యాధి ఏమంటే, అన్యశేషత్వం. అంటే, భగవంతునకు శేషంగా ఉన్నామని భావించకుండా, ప్రవర్తించకుండా, మరి ఇంకెవరికో శేషమై ఉన్నామని భావించి, దానికి అనుగుణంగా ప్రవర్తించడం. ఊహించుకున్న, నిజానికి తగని ఏ కారణం చేతనో, తాను భగవంతునకు శేషమని గుర్తించకుండా ఎవరికో దాసుడను ఇంకెవరికో దాసుడను— అని భావించడమే వ్యాధి.

నిజానికి, భగవంతుడు తప్ప, మరి ఎవ్వరూ మనలను సృష్టించడం లేదు రక్షించడం కూడా లేదు. వారు, మనకు ఈ లోకాన్ని కానీ, లేక, పై లోకాలను కానీ ఇవ్వడం లేదు, ఇచ్చే శక్తి కూడా వారికి లేదు. కానీ, మనం ఏదో ఒక చిన్న అల్పమైన సుఖం కోసం, ప్రయోజనం కోసం "వీరికి మనం దాసులం" అని భావించి చెప్పుకుంటున్నాము, ఆ విధంగా ప్రవర్తిస్తున్నాం. దీనికి అన్య శేషత్వం అని పేరు. నిజానికి భగవంతునకు శేషమై ఉండేటట్లే, భగవంతుని భక్తులకు కూడా శేషంగా ఉండవచ్చు. అందులో దోషం లేదు. ఆ

విధంగా కాకుండా, అన్యులకు, ఏదో ఒక కారణాన్ని ఊహించుకొని, కల్పించుకుని శేషమని భావించడం, ప్రవర్తించడమే దోషం. అదే అన్యశేషత్వమనే వ్యాధి. ఇది ప్రబలమైన, ఈ లోకంలో ఉండే మనవంటివారిలో కనిపించే వ్యాధి.

రెండవ వ్యాధి ఏమంటే–" నేను ఎవ్వరికీ శేషం కాదు, నాకు నేనే శేషం, నేనే ఈశ్వరుడను, స్వతంత్రుడను" అని భావించడం, ఆ విధంగా ప్రవర్తించడం. దీనికి స్వాతంత్ర్యం అని పేరు. ఇది ప్రచురంగా, పై లోకంలో ఉండే ఇంద్రాది దేవతలలో ఉండే వ్యాధి.

ఈ రెండు విధాలైన, తగని భావాలను కలిగి ఉండడం, వాటికి తగినట్లు ప్రవర్తించడం– అనే రెండు వ్యాధులనే త్రివిక్రముడు తీర్చాడు. ఒక పాదంతో ఒక వ్యాధిని, ఇంకొక పాదంతో ఇంకొక వ్యాధిని పోగొట్టాడు. భగవంతుని ఒక పాదం కిందిలోకాలను కొలిచింది, ఇంకొక పాదం పై లోకాలను కొలిచింది.

ఈ విధంగా భగవంతుడు ఎందుకు చేశాడో తెలుసునా? మనవంటి మానవులంతా ఉండే లోకం క్రింది లోకం, భూలోకం. మనలో ఉండే వ్యాధి ఒక విధమైన వ్యాధి. అదే అన్యశేషత్వం అనే వ్యాధి. తగని విధంగా, ఎవరెవరికో శేషమై ఉన్నామని భావించడం, దానికి తగినట్లు వర్తించడమనే వ్యాధి. మనలో ప్రచురంగా ఉండే వ్యాధియే ఇది. "నేను స్వతంత్రుడను" అనే వ్యాధి కలిగి ఉండేవారైతే, ఈ లోకంలో తక్కువ అనే చెప్పాలి. ఈ విధంగా అన్యశేషత్వ భావనను కలిగి ఉండడం– అనే వ్యాధిని భగవంతుడు– "మీరెవరికో శేషం కాదు, నాకు మాత్రమే శేషం. మీరంతా నా సొత్తు. మా చేత సృష్టింపబడినవారు, రక్షింపబడేవారు" అనే తత్వాన్ని ఈ లోకాన్ని అంతటినీ ఒక పాదంతో కొలువడం ద్వారా తెలియజేసి తీర్చాడు, త్రివిక్రముడు.

ఆలోచిస్తే, భగవంతునకు కాకుండా ఇంకెవరికో శేషం— అనే భావించడం ఒక విధంగా దోషమే అయినా, దీనికి మించిన దోషం స్వాతంత్ర్యం అనే దోషం. ఇది ప్రచురంగా పై లోకాలలో ఉండే దేవతలలో గోచరిస్తుంది. ఇంద్రుడు, చంద్రుడు, వరుణుడు, కుబేరుడు మొదలైన, పై లోకంలో ఉండే దేవతలకు అందరికీ ఈ విధమైన, "తాము దేవతలం కనుక, స్వతంత్రులం, ఎవరికీ శేషం కాద"ని భావించడం, దానికి అనుగుణంగా వర్తించడం అనే అహంకారం, గర్వం ఉండడం గోచరిస్తుంది. అందుచేత, వీరికి గల వ్యాధి స్వాతంత్ర్యమనే భావం. దీనిని భగవంతుడు ఇంకొక పాదంతో పై లోకాలను కొలుస్తూ తీర్చాడు.

త్రివిక్రముడు ఒక పాదంతో క్రింది లోకాలను కొలిచి, " మీరు అన్యులకు శేషం కాదు, నాకే శేషం" ఈ లోకంలో ఉండేవారికి తెలియజేసి, అన్యశేషత్వమనే మనకు ఉండే వ్యాధిని పోగొట్టాడు. ఆ విధంగానే, ఇంకొక పాదంతో పై లోకాలను కొలిచి, " మీరెవరు స్వతంత్రులు కాదు సుమా! నా అధీనంలో ఉండేవారే, నాకు మీరు శేషం" అని ఇంద్రాదులకు తెలియజేసి, వారి స్వాతంత్యమనే ప్రబలవ్యాధిని తీర్చాడు. ఇదే భగవంతుడు రెండు పాదాలతో కింది లోకాన్ని, పై లోకాలను కొలువడంలో ఉండే రహస్యం.

అందుచేత, ఎప్పుడో జరిగిన వృత్తాంతాన్ని ఇప్పుడు మనం తెలిసికొంటే మనకేమి లాభం? అని భావించకూడదు. ఈ నాటికీ భగవంతుడు తన త్రివిక్రమావతార వృత్తాంతం ద్వారా మనకు గల అన్యశేషత్వ వ్యాధి తీర్చి, మనకు క్షేమాన్ని కలుగ జేస్తున్నాడు. ఈ త్రివిక్రముడు ఎంత గొప్ప వైద్యుడో కదా. అన్యవైద్యులు ఎవ్వరూ తీర్చలేని మన వ్యాధులను నయం చేస్తున్నాడు. ఆహా!.

